శివశంకరశాస్త్రి.

# హృదయేశ్వరి

రాజమహేంద్రవరము, 1925.

Record no. 90

Śivaśaṅkaraśāstri.

Hṛdayēśvari

Rājamahēndravaramu, 1925.

Record no. 90

## Bibliographic Record Target

శివశంకరశాస్త్రి.
హృదయేశ్వరి / శ్రీ శివశంకరశాస్త్రి. - రాజమహేంద్రవరము : సరస్వతీ పవర్ ప్రెస్, 1925.
142 p. :ill. ;17.5 cm.
Record no. 90

Śivaśaṅkaraśāstri.
Hṛdayēśvari / Śrī Śivaśaṅkaraśāstri. - Rājamahēndravaramu : Sarasvatī pavar pres, 1925.
142 p. :ill. ;17.5 cm.
Record no. 90

# హృదయేశ్వరి

* श्रीमद्राधावल्लभो विजयते *

సాహితీసమితి సభాపతి, ఉత్తమగ్రంథమాలా,
సఖి, సరస్వతీగ్రంథమండలీ సంపాదకుడు

## శ్రీ శివశంకరశాస్త్రి



దావులూరు వెంకట సుబ్బారావు
నాజరుపేట * * తెనాలి

సర్వస్వామ్యములు
త. శివశంకర శాస్త్రిగారివి

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయడుగారి
సంస్కృతీ పవర్ ప్రెస్ * రాజమహేంద్రవరము

# వక్తవ్యము

ఈయుపకావ్యమును జదువునప్పు డొక్కపట్టున జనుటకన్న ఘట్టము ఘట్టముకడను గొంతతడవు నిలుచుచుండుట యుక్తము. వివిక్తప్రదేశము విభావరీవేళయు నీకావ్యరసాస్వాదమున కను కూలములు.

సహృదయులు కావ్యప్రపంచమును తద్ధర్మాను సారముగా బరిశీలించుచు, వర్ణితవిషయముల సరసవిరసస్వభావమును, విశిష్ట కవికిని తదిత రులకును గల తారతమ్యమును ముఖ్యముగా గమ నింతురు.

ఇందలి విషయముల కుద్వేగము జెందక, అం దందు గోచరించు ప్రాచీనమహాకవుల భావ చ్ఛాయలను స్తేయముగా నెంచక, రసికు లా నందింతురు.

నాయకుని నామము నిర్దిష్టము కాలేదు. హృదయేశ్వరి లక్ష్మీపదాంకిత యయినది. కిరా తార్జునీయము లక్ష్మీపదలాంఛితము, మాఘుని కావ్యము శ్రీపదాంకితము.

స్వాదుపరాఙ్ముఖులు కాని వారల కెల్లరకును కావ్య ముద్దిష్టము. అయినను, వివిధసారస్వత నిష్ణాతలు, ప్రాక్ప్రతీచీసాహిత్య సమీక్షావిధాన దక్షులు, పద్యరచనా రహస్యవేత్తలు, కామకలా ప్రవీణులు, ఆరోగ్యశాలురు నగుభావుకులే స్వారస్యనిర్ణాయకులు.

కమనీయ కిశోరముగ్ధమూర్తేః
కలవేణుక్వణితాదృతాననేన్దోః
మమ వాచి విజృంభతాం మురారేః
మధురిమ్ణః కణికాపి కాపి కాపి!

శ్రీ శివశంకర శాస్త్రి

సాహితీసమితి, తెనాలి
జనవరి ౧౯-౫౭

## శ్రీ శ్రీ లక్ష్మీ దేవికి

అనిశము మెలంగు నీమనోహారిమూర్తి
స్వచ్ఛమామక భావనాసౌధమందు
వెలసెను కవిత్వ మేదేవివీక్షణమున
అట్టిహృదయేశ్వరికి నిది యంకితంబు!

* * *

నీవు స్త్రీజాతియందు జన్మించుకతన
వరలుచుండును పూజ్యభావంబు నిఖిల
భామినీజనలోకమువట్ల నాకు;
నీవు నాదృష్టిలో మహాదేవి వమ్మ!

పేదవడియున్న నామనఃపేటి మిగుల
దనరు నుజ్జ్వలభావరత్నములతోడ
త్వద్వదన నీరజాతసందర్శనమున;
నీవు నాపాలిటికి రమాదేవి వమ్మ!

మన్ననమ్మున లీనమై మాటువడిన
విమల కవితాప్రవాహము వెగ్గలించు
నిన్ను వర్ణింపనెంచిన నిమిషమందు:
నీవు నాకు సరస్వతీదేవి నమ్మ!

నిన్ను ధ్యానించుచుండ నిర్నిద్ర మగుచు
బ్రమదమున జేరు మానసబంభరంబు
రాధికానాథు పాదనీరజయుగమ్ము:
వింత గొల్చెడి నాముక్తికాంత వమ్మ!

వివిధభంగుల నిన్ను భావించుకొలది
పొడముచుండు నమస్కారబుద్ధి నాకు!
జాజువారిన నీ పదాంభోజయుగళి
వ్రాలుభక్తుని కరుణతో నేలుకొమ్మ!



౧

ఆమనోహరమాఘసాయంతనమున
ఇష్టసఖుతోడ నరణి నే నేగుచుండ
అక్కజము గొల్పి తోచె నీయాననంబు
నరసిపై దేలియాడెడి జలజమట్లు!

మధుపమై పోయె నపుడె నామానసంబు
నీముఖాబ్జముపై వ్రాలునిరతితోడ.
పాదయుగళంబు తోడనె పార్శ్వమునకు
దిరిగి కదలజొచ్చె విధేయ మగుచు!

నుందరద్వారదేశమునందు నపుడు
స్థిరముగా నిల్చియున్న నీదేహాయష్టి
పటముపై వ్రాసి యావృతిబద్ధమైన
ప్రతిమపోలిక నాకు విభ్రమము గొలిపె!

పంకజాతాక్షి, నామీద బరపినట్టి
నీకటాక్షేక్షణావళీనిశితవిశిఖ
వితతి తాకగ మన్మనోవిహగ మపుడె
పల్లటిలి వ్రాలె నీపాదపద్మములను!

నీమనోహరవసననిర్నిద్రవిమల
సాంద్రచిత్రితసహకారజాలకముల
మధ్యసీమను మీనాయమాన మగుచు
సంచలించె మదీయలోచనయుగంబు!

మహితలావణ్యవిద్యోతమానతావ
కాననసుధాంశుబింబమునందు నిలిచి
మరలదయ్యె జకోరమువూడ్కి దేవి,
దివ్యరాగార్ద్ర మైననాదృష్టి యపుడు!

తప్పదాయెను నిను వీడి తరలి చనక:
మరలి చూచితి, వీక్షణమాలికలను
బరపితివి శాంతగతిని నాపైని దేవి,
ధన్యతం గంటి నంచు నే దలచుచుండ!





౨

అగ్రహారమునందు భక్తాళి కెల్ల
వివిధకామ్యములం దీర్ప వెలసియున్న
శ్రీపయోధరకలశవారీగిజేంద్రు
గొలిచి ప్రాంగణభూమిని నిలిచియుంటి.

దేవి, యచటికి నీ వరుదెంచినావు:
అపుడు నీపార్శ్వవర్తిను లడ్డ మగుట
గానరాదాయె నీముఖకమల మయ్యొ
పర్ణముల మాటువడినపుష్పమ్మువోలె!

మధురమంథరగతి నీవు మందిరమ్ము
లోని కేగుచునుండ నాలోలదృష్టి
హర్షమున దన్వయం బయి యనుసరించె
పల్లవమనోజ్ఞ మైననీపాదయుగళి.

నీముఖజ్యోత్స్న నామీద నెరయుకొరకు
నాలయములోని కల్లన నరిగినాడ ;
ఇంతలోపలనే తటిత్కాంతవో[illegible]
దరలిపోతివి వేరొకద[illegible] !

చిమ్మచీకటి గ్రమ్మె హృ[illegible]
చూడ్కు లున్న [illegible] మయ్యె,
దేవి, యీదీనునకు నింక ధ్యేయ మొకటె :
స్థలకమలరమ్య మైననీచరణయుగళి !

3

నీమనోహరమూర్తి ధ్యానించుకొనుచు
మెల్లగా బోవుచుంటి మీమేడదరిని ;
తలపనితలంపుగా భవద్దర్శనంబు
కలిగినది దేవి, కన్నులకరవు దీర !





పద్మసంకాశ మైననీపాణియందు
సంస్కృతగ్రంథరాజము సంతరించి
అంచయానముతో నరుదెంచినావు
దివ్యశోభను భారతీదేవివోలె.

కమ్రసుస్నిగ్ధనీలాంశుకమ్ము దాల్చి
యెదురుపడితివి దేవి, నీ వింపు లొలుక,
అంబుదశ్యాము డైనమురారిదేవు
లలితసంశ్లేషమందలిలక్ష్మిభాతి.

శాంతరమ్యభవత్కటాక్షంబుచేత
నాదుహృదయంబు మిగుల నామోద మొందె
స్వచ్ఛచంద్రమయూఖసంస్పర్శనమున
బరిమళించెడిమల్లికాప్రసవమట్లు.

కన్నులరమోడ్చి యాననకమల మల్ల
రమ్యముగ వాల్చి లజ్జాభిరామగతిని
లలితజంగమకాంచనలతికరీతి
హర్మ్యభాగమ్ములోనికి నరిగినావు.

చటులవిభ్రమగతి భవత్కుటిలకేశ
జాలమున జిక్కుకొనియె లోచనయుగమ్ము;
నవయు మోక్షము లేక బంధనమునందె
త్వత్కటాక్షమ్ము వరలునందాక దేవి!

౪

దేవి, యీనేత్రములకు యాదృచ్ఛికముగ
ద్వన్మనోహరరూపసందర్శనాభి
సిద్ధికయి యెన్నిసార్లు నిల్చితినో తెలియ
దహహా! వాతాయనమ్ముల కభిముఖముగ.

విమలకమనీయవదనారవిందదివ్య
వీక్షణక్షణరక్తి దేవి, త్వదీయ
సౌధసవిధమ్మునకు నెన్నిసార్లు తీర్థ
యాత్రసల్పితినో తెల్ప నలవి కాదు.





అమలసంజీవనౌషధం బైననీదు
శాంతరమ్యకృపాకటాక్షంబుకొరకు
చెలగి హర్మ్యమునకు ప్రదక్షిణము లెన్ని
చేసితినో దేవి, లెక్కించి చెప్పలేను.

హృదయభారఘనధ్వాంతవిదళనాచ్ఛ
చంద్రికాకాంతిపూరయుష్మన్మనోజ్ఞ
దివ్యదరహాసమునకు మందిరములోని
కెన్నిసారులు వచ్చితి నెరుకలేదు.

౫

దేహళీపార్శ్వమున నిల్చి దేవి, నీవు
వేడుకం గాంచుచుంటివి వెడలు "ప్రభలు"
చూచుచుంటిని మిగుల నుత్సుకతతోడ
పథమున న్నిల్చి నీముఖప్రభలు నేను.

స్తిమితకోమలమైననీసితవిలోక
నావళికి సాంద్రమైననాయసితనిశిత
దృక్కులకు సంఘటిల్లిన దెదురుకోలు
కుముదనీలాంబుజంబులగుమివిధాన.

అప్పుడు నిలువెల్ల రోమాంచ మయ్యె నాకు
హర్షమున మే నెరుంగగా నైతి నంత
నిన్ను విడిపోవ బుద్ధి జనింప దయ్యె
కాని ఘంటాపథంబని కదలిపోతి.

తృప్తి దీరక భవదీయదివ్యవదన
మంజురోచిస్సుపై దేవి, మరలమరల
వెనుదిరిగి చూచుచుం బోతి వెగ్గలంపు
దటిని కెదు రేగుచుండెడితరణివోలె.

రాగము భరింపలేక హర్మ్యముచుట్టు
శీఘ్రగమనముతో బ్రదక్షిణము చేసి
మరలివచ్చితి వేరొకమార్గమునను
నీముఖాంభోజదర్శననిష్ఠతోడ.





అరుగనుంటివి సౌధాంతరాళమునకు
దేవి, మద్వదనంబు నీదృష్టిపథము
నందు దోచుటచే భవదాననంబు
రక్తిమం దాల్చె లజ్జాభిరామ మగుచు.

కోమలమనోజ్ఞవిమలదృక్కోణతరళ
దివ్యశీతలభవదీయదృష్టు లప్పుడు
పిక్కటిల్లి మదాననబింబముపయి
జెలువుగా వ్రాలె వెన్నెలపులుగులట్లు.

మరలి చనుచుండ నీ వంత మందిరాంగ
ణాప్రదేశమువెంట నానయనయుగళి
కమ్రసుస్నిగ్ధభవదీయగండఫలక
భాగమున నాట్యమాడె జృంభణముతోడ.

గ్రీవము మనోజ్ఞముగ నంచి క్రిందిచూడ్కి
మోహనమయూరిపోలిక నాహరించి
యేకకాలమునందె మదీక్షణములు
చిత్తమునుగూడ, హర్మ్యము చేరినావు!

## ౬

శాంతశీతలరమణీయసాంధ్యవేళ
నరుగుదెంచుచు విద్యాలయమ్మునుండి
రమ్యహాసంబు మన్మనోరథము దాల్చి
యెదురుపడినట్లు నీవు కాన్పించినావు.

క్షౌమధారిణివై చతుష్పథమువెంట
ధీరగమనమ్ముతో వచ్చుదేవి, నీవు
కమలగర్భనికంఠశృంగాటకమున
జెలగువాగ్దేవిపోల్కి దోచితివి నాకు.

పార్శ్వవర్తిను లుంటచే బక్ష్మలముల
నించుక గదల్చి యిటు బ్రసారించినావు
మనసిజునిపుష్పపంచకమార్గణాభ
మైననిశితేక్షణంబు రహస్యలీల.





ఫాలమున వ్రాలి నాసికాపథమువెంట
నధరబింబముపై జారి యవల నీదు
మృదుకపోలతలమ్మున నొదిగి తుదకు
దివ్యతాటంకసీమ నాదృష్టి నిలిచె.

భావభరమున నీమృదుపదయుగంబు
తొట్రిలగ సాగిపోతివి త్రోవవెంట!
విస్మరింపక యేకాంతవేళలందు
నన్ను దలపోతు వని దేవి, నమ్మువాడ!

## ౭

మెలగుచున్నావు నేత్రనిమీలనమున
మెలగుచున్నావు వీక్షణోన్మీలనమున
నిన్ను నిరతమ్ము ధ్యానించుచున్నవాడ
దేవి, వీనికి వేరొండుదృష్టి లేదు.

ముకుళితమ్లాన మైననాముఖసరోజ
వికసనము సేయుతరుణార్కబింబ మీవ;
నవసిపోయిననానేత్రకువలయముల
శోషణము బాపు శీతలజ్యోత్స్న వీవ;

గాఢతాపార్త మైననాగాత్రమునకు
సాంద్రసురభిళచందనచర్చ వీవ;
ఆధిభరమున నిర్జీవ మైనహృదికి
చారుశీతలతరసుధాసార మీవ;

ఇంపు లొల్కగ జంగమహేమవల్లి
భంగి జెలగెడి నాబహిఃప్రాణ మీవ;
నన్ను బాలింప గమనీయనవ్యగాత్ర
లతిక గైకొన్న నాభాగ్యలక్ష్మి వీవ;

అతివిశాలగభీరభవార్ణవంబు
నన్ను దరియింప జాలిననౌక వీవ;
స్థిరపవిత్రమదీయహృత్పీఠనిహిత
దివ్యవిమలానురాగాధిదేవి వీవ!





౮

నిర్మలప్రేమనిష్ఠమై నీపదాబ్జ
పీఠమున నుంచినాను నాస్ఫీతహృదిని;
నీయఖండితకారుణ్యనిరతి నిపుడు
నాసమస్తమ్ము నర్పించినాను దేవి!

స్వచ్ఛభవదీయలావణ్యసరసిలోన
మజ్జనం బొనరించె మన్మానసంబు
చిత్తమందు వానప్రస్థవృత్తు లెల్ల
క్షాళితము లయ్యె, నిర్మలచ్ఛవి జనించె.

మహితజీవననిమ్నగామధ్యమందు
ప్రబలనైరాశ్యభీషణావర్తవితతి
బడి యడంగుదు నేను! సప్రణయదృష్టి
పాణి గ్రహియించి నన్ను గాపాడు దేవి!

ఇంతలోకములోన నీవే మదీయ
మార్గదర్శక దేదీప్యమానతార,
వింతసంసారజలధి నీవే మదీయ
దివ్యసంస్థితి కమృతంపుదీవి దేవి!

నాహృదయరాజ్యలక్ష్మి, అనారతంబు
నిన్ను ధ్యానించుచుంటి ననింద్యమతిని.
ఈయకల్మషభక్తి నహీనవిమల
తావకీనకటాక్షంబు తనుపు టెప్పుడో!

౬

మినుకు మినుకని చుక్కలు మెరయుచుండె
ఆవరించెను జిరుమబ్బు లాకసమ్ము
ఎదురుగా దోచుచుండె మహీధరమ్ము
పార్శ్వముల బాదపశ్రేణి పరగుచుండె.





కలరవంబున "బందరుకాల్వ" మిగుల
నింపు లొల్కెడుగతి బ్రవహించుచుండె.
నీరరేఖను బ్రాపించి కూరుచుంటి
ప్రాణసఖుతోడ నందలిపడవమీద.

తన్మధురరాత్రివేళ దత్ప్రాంత మెల్ల
నిర్జనమనోహరమ్మయి నెగడుచుండె.
శ్రవణగోచరమై యొప్పె శ్రావ్యరీతి
కృష్ణవేణీమహాపగాగీతరవము.

మందపవనకుమారుడు మధురగతిని
కోమలము లైనమాదుముంగురులతోడ
లలితపాండురచేలాంచలములతోడ
నాడుచుండెను సయ్యాట లనుపదమ్ము.

నిన్ను వర్ణించె నప్పుడు నిస్తులముగ
భావభరమున నాగిరాందేవిదివ్య
స్తన్యబిందుకదంబకాస్వాదమధుర
మంజులకవిత్వధోరణి మత్సఖుండు.

శ్రవణయుగళీమార్గంబున సర్వగాత్ర
మాక్రమించితి వల్లన నపుడు దేవి !
అఖిలభువనంబు విస్మృత మయ్యె నెదుట
నీమనోహరరూపమ్ము నిలుచుకతన.

హంసపల్కులచే నిషధాధిపతికి
భీమభూపాలపుత్రిపై ప్రేమవోలె
ఆప్తవాక్యము లాలించినంత నాకు
ప్రణయ ముదయించి నీయెడ బరిఢవిల్లె.

విజయవాడపురమ్మును వీడి యువల
కృష్ణవేణీమహాతరంగిణీ దరించి
పర్వతశ్రేణి దాటి సంభ్రమముతోడ
దక్షిణాపథవర్తినై తరలె మనము !





౧౦

విరహసంతాపభరమున వేగివేగి
త్వన్ముఖసుధాంశుబింబసందర్శనాభి
రతిని నిల్చితి మీహర్మ్యరమ్యపట్ట
భంగపాళీలసత్పురోభాగమందు.

అంగణవిరాజమాననవ్యామ్రవిటపి
లలితకుసుమపరిమళలహరి దెచ్చి
గంధవాహకుమారుడు కరుణతోడ
నాకు నామోద మొసగూర్చినాడు దేవి !

దీపికల్ సదనాంతరదేశమందు
వెల్గుచున్నవి తారకావిలసనమున.
మురువు గుల్కెడుభవదీయముఖసుధాంశు
బింబ ముదయింపలేదు సంప్రీతి నెరప.

నిష్ఫలం బింక నిచ్చట నిలుచు టనుచు
మది నిరాశను వ్యథ నొంది మరలనుండ
అంబువాహతిరస్కరిణ్యంతరోది
తేందుమండలమట్లు కాన్పించినావు !

దుస్సహావియోగభారదోదూయమాన
మానసము చల్లబడియె నమందలీల
భవ్యమందారకల్పకపారిజాత
పల్లవరసాభిషేకంబుభంగి నపుడు.

ధవళకౌశేయపరిధానధారిణి వయి
దేహలత హేమదీధితి దేజరిల్ల
వల్గుగమనమ్ముతో నీవు వచ్చినపుడు
కేవలము లక్ష్మి వనియెడిభావ మొదవె.

అమృతబిందుకదంబకస్యంది, హృదయ
హారి, విస్ఫారితవిలోచనాబ్జయుగళి
నిండుగా నీవు నామీద నిల్పినపుడు
లయము నొందితి మాధుర్యలహరిలోన !





ద్వారదేశమునుండి తత్పార్శ్వసీమ
కతిమృదుమనోజ్ఞగతిని నీ వరిగి దేవి,
తోడనే రత్నపుత్రికాద్యుతులతోడ
క్రమ్మరిలినావు ద్వారోపకంఠమునకె.

అలసవలితములై యీషదార్ద్రము లయి
ముగ్ధహారిణీవిలోకనస్నిగ్ధము లయి
అలరునీనేత్రకోణనిర్యత్కటాక్ష
పంక్తులకు నైతి బాత్రము ప్రణయమూర్తి !

మధురభావావళీలసన్మతిని నేను
మధురిమముకన్న మధురమౌ మధురమూర్తి!
మధురయామిని వేళ నీమధురిమమున
పూర్ణముగ ముగ్ధభావము పొందినాడ !

౧౧

బౌద్ధులకు నాకు బుద్ధిలో ప్రణయమూర్తి,
అరయ నెంతటితారతమ్యంబు కలదు!
ఉభయులకుగూడ సాదృశ్య మున్న దొకట:
నాకు వారలకును "త్రిరత్నములు" కలవు!

నిర్మలం బయి సంస్తవనీయ మగుచు
ఉత్సుకోత్క్షిప్తమత్కర్ణయుగ్మమునకు
దివ్యభూషాయమానమై తేజరిల్లు
త్వద్గుణగణంబు ప్రథమరత్నంబు దేవి!

చతురవాణీలసద్గ్రంథజాతపఠన
సక్తదృఢమత్యనాదృతసమయ మగుచు
అక్కజము గొల్పు నీదువిద్యాభినిరతి
తరళరూపద్వితీయరత్నంబు దేవి!





ధీరగంభీరశాంతమదీయహృదయ
చలన మొనరించి మరల సంసారవాంఛ
నతితరంబుగ జేయునీయావనంపు -
నవ్యశోభ తృతీయరత్నంబు దేవి!

అమలినము లైనయీత్రిరత్నముల నేను
స్తవము సేయుచునుందు నక్తందివంబు.
స్వాంతసంస్థిత మావ్యథాధ్వాంతపటలి
తెరలుచుండును వీనిదీధితులచేత.

౧౨

వీతరాగులు సంత్యక్తవివిధసుఖులు
శూన్యవాదులు బౌద్ధభిక్షుకులు దేవి!
కలవు వారలకెల్ల సంఘమ్ము, బుద్ధ
దేవుడును, ధర్మ మనియెడు "త్రిశరణములు".

సతతహృదయాంతరాళజాజ్వల్యమాన
దివ్యవిమలానురాగసందీప్తిశాలి,
సఖిలఋజుమార్గకలితభోగాభిరతుడ:
దేవి, ఉన్నవి నాకును త్రిశరణములు.

నిన్ను వర్ణించి నీయెడ నిరుపమాను
రాగ ముదయింప జేసినరమ్యమూర్తి,
ఆర్ద్రహృదయుడు, మామకప్రాణసఖుని
యమృతనిష్యందివాక్కుల నాశ్రయింతు!

అఖిలశృంగారనిధి, జగదాశ్రయుండు,
భక్తవాంఛితనిఖిలసంపత్ప్రదుండు,
నన్ను నిను గూర్చు రాధికానాథదేవు
నంఘ్రిపంకేరుహంబుల నాశ్రయింతు!

అమలలోచనతారక, నంతరంగ
రాజ్యలక్ష్మివి, విమలానురాగనిధివి,
నాతపఃఫలఖనివి, ప్రాణమవు దేవి!—
అట్టియుష్మత్కటాక్షమ్ము నాశ్రయింతు!





౧౩

తరుణమార్తాండరుచిపోలె నరుణ మగుచు
జృంభితాంభోరుహాముభాతి స్మేర మగుచు
పృథుశిరీషసంవర్తికాపేశల మయి
అలరునీపాదయుగళి ధ్యేయంబు నాకు!

వికసితసరోజనిర్నిద్రవిభ్రమంబు
పూర్ణిమాచంద్రబింబవిస్ఫూర్తిశాలి
ఇందిరామందిరము సుధాహేమకలశ
మగుభవద్వదనంబు ధ్యేయంబు నాకు.

ఫుల్లనీలోత్పలప్రభాపుంజ మగుచు
అమలబాదామఫలరూపహారి యగుచు
మంజులాకర్ణవిశ్రాంతిమహిత మగుచు
అలరునీనేత్రయుగళి ధ్యేయంబు నాకు.

వాసవమణిద్యుతిచ్ఛటాభాసురంబు
చిక్కణతమాలదీధితిస్నిగ్ధముగ్ధ
మాకళిందసుతాతరంగాభిరామ
మగుభవత్కైశికంబు ధ్యేయంబు నాకు.

౧౪

దేవి, నీరమ్యమూర్తి మదీయహృదయ
పుండరీకాసనమున బ్రపూర్ణభక్తి
నిష్టదైవతముగ బ్రతిష్ఠించి, యెపుడు
వివిధవిధముల నిన్ను సేవించువాడ.

అపరిమేయానురాగతోయమ్ముతోడ
నీకు దివ్యాభిషేకంబు నెరపువాడ.
మధురభావపరంపరామాల్యములను
లలితభవదీయకంఠం బలంకరింతు.





గాఢరసమంజులకవిత్వగానఫణితి
వీను లలర భవత్కథల్ వినుతిచేతు
హర్షభరమున నైక్యమే యలరునట్టు
లంతరంగము చేతు సమర్పణంబు!

౧౫

శ్రవణములు సోకినంత దుస్సహవిషాద
కర్దమక్షాళనము చేయగలిగినట్టి
త్వన్మధురనామధేయామృతమ్మె గాని
ఇతర మేమియు జెవి జేరనీయ నొల్ల.

దివ్యగంగాతరంగిణీతీర్థమట్లు
భాషితావిలమార్జనపటిమ గల్గి
మధుమధుర మైనతావకకథలె గాని
యితరమును జిహ్వవెంట రానీయ నొల్ల.

చిత్తసద్ధ్వాంతరాశిసంస్థితవిషాద
గాఢతమసంబు హరియింప గల్గినట్టి
భవ్యభవదీయరూపదీపంబుకన్న
నితరమును దృష్టిసరణి రానీయ నొల్ల.

చారునిర్మలచంద్రికాపూరమట్లు
హృదయతాపము చల్లార్చి ముదము గూర్చు
త్వన్నిరంతరమధురభావనలె గాని
యితర మేమియు మదికి రానీయ నొల్ల!

౧౬

నీనివాసమనోహరనిలయమైన
మామకామలహృదయసద్మంబునందు
మాత్రమే కాక దేవి, నీమధురభంగి
అన్నిదిశల బ్రకాశించు నద్భుతముగ!





అమలకౌముదీధవళీకృతాంబరమున
తావకీనాంశుకప్రభల్ తనరుచుండు.
స్ఫీతరాకాసుధాకరబింబమందు
దోచుచుండు భవన్ముఖద్యుతులు దేవి!

వెలుగునిర్మలతారకావిసరమందు
మలయు మందస్మితాంకూరమధురిమంబు.
గాఢకాదంబినీచ్ఛన్నగగనమునను
దీర్ఘభవదీయకేశదీధితులు చెలగు.

భాసురోరుసంధ్యారాగపటలిలోన
తావకీనానురాగసుశ్రీ వెలుంగు
శాంతగాఢవిభావరీసమయములను
వెలయు భవదీయహృదయగాంభీర్యముద్ర.

ముగ్ధకల్యాణసుకుమారమూర్తి దాల్చి
వరలుచున్నావు నీవె సర్వమ్మునందు!
ప్రకృతిరూపిణివై నీవు పరిఢవిల్ల
గానరా దన్య మేమి నీకన్న నాకు!

## హృదయేశ్వరి

రమ్ము మామకహృదయసామ్రాజ్యలక్ష్మి !
నీకటాక్షమ్ము నామీద నిలువనిమ్ము !
ఆర్ద్రహృదయప్రసన్నుడ నైతి దేవి !
నన్ను నీలోన నైక్య మ్మొనర్చుకొమ్ము !

ప్రథమోచ్ఛ్వాసము

## విభ్రమము

## ౧౭

ప్రేయసీ, యేల వింటి నీపేరు నేను!
ఆలకించినదాది నామాక్షరముల
నేమి వింతయొ కాని మదీయహృదయ
దుగ్ధవార్ధిని మథన ముద్భూత మయ్యె!

అధిక మైనకోలండిని మథన మకట!
ఉద్గమించెను కాలకూటోగ్ర విషము.
ప్రేయసీ, సిల్పితిని దాని బిగియబట్టి
కంఠకుహారమ్మునందు శంకరునిభాతి.

ఉత్సుకతతో నిరీక్షించుచున్నవాడ
భవ్యలక్ష్మీసమాగమప్రాప్తికొరకు
పూర్ణనిరతాన్వయసుధానుభూతికొరకు:
ఎన్నటికి నాకు లభియించు నివి యెరుంగ!

## ౧౭

సాంధ్యవేళను ప్రథమదర్శనము మనకు
సంఘటిల్లినవిస్మయక్షణమునందె
చిక్కుకొన్నది మామకచిత్తఖగము
సంకులభవద్విలోకనజాలకముల!

పట్టువడినది దృఢముగా బక్షియుగళి,
ఎగురజాలక యకట! ఈహృదయఖగము
జీవితేశ్వరి, మిగుల కృశించుచున్న
దన్యగతి యేమి గాన కహర్నిశమ్ము!

కరుణ వహించి యీద్విజాగ్రణికి దేవి,
బంధనవిముక్తి చేయుట పాడి గాదె?
త్వన్మనోహర పాణిసంస్పర్శనమున
పులకితంబయి నిర్వృతి పొందగల్గు!





## ౧౮

అయ్యయో! యేల చూచితి వట్లు నన్ను
ఆదినమ్మున మధురసాయంతనమున
దేహళిని నిల్చి మోహినీదృష్టితోడ,
పథమువెంబడి జనెడి విభ్రాంతహృదయు!

విపులభవదీయలోచనవిగళదసిత
బహుతరకటాక్షదృఢశగపంజరమున
మన్మనోభీష్టమూర్తి యేమాట లేక
వేగముగ వ్రాలిపడిపోయె వివశగతిని!

జర్జరిత మయ్యె నకట! నాసరళచిత్త,
మిప్పటికినైన బాధ శమింప లేదు.
చిలుకకుంటివ యేని నీస్నేహపూర
మతితరాల్పము సుమి జీవితాశ నాకు!

ఏమి హృదయాపహారిణీ, యింకనైన
కరుణ వహియించి పీనిని కావగదవె!
బహుళతాపముచే మతిభ్రంశ మొంది
వివశమైపోయె నయ్యయో వెర్రినైతి!

౨౦

ఈహృదయదాహ మెట్టిదో యెరుక గలదె
నీకు హృదయేశ్వరీ, నేను నిన్నె నమ్మి
సకలము త్యజించినాను నిస్సంశయముగ
నను గటాక్షింతు వనుచు నేనాటికైన!

నిన్ను గాంచినదాదిగా నేటివరకు
నిశ్చలమ్ముగ నీమీద నిలిచియుండి
బుద్ధి యన్యముఖంబుగా బోవలేదు.
దేవతారూపిణివి నాకు గేవలంబు!





ఎవ్వరికి తావు లేకుండ హృదయమెల్ల
నాక్రమించితి వౌక్కతె వక్కజముగ!
స్మరణకు నతీతమౌ పూర్వజన్మమందు
విమలబాంధవ్య మేదియో వెలయు మనకు.

ఈహృదయదాహ మారుట యేవిధాన,
స్వచ్ఛభవదనురాగవర్షమున గాక!
జీవయాత్ర సుఖమ్ముగా జెలగు టెట్లు,
భవదమోఘకరావలంబనము లేక!

౨౧

అన్నపానీయములు విడనాడి దేవి,
వివిధసుఖముల నన్నిటి విడిచి, ఘోర
తపము చేయుచునుంటి దాత్పర్యనిష్ఠ
నిన్నె లక్ష్యమ్ముగా మది నిల్పియుంచి.

అవయవమ్ములు ఘనతపోహవ్యవాహ
శిఖలతాకున మిగుల గృశించిపోయె!
కరములు గదల్పకున్న నకాండముగనె
జారిపడునంగుళీయముల్ సాక్ష్య మిచ్చు.

దేవి, వీని నైశ్చల్యము తెలిసికూడ
ఇప్పటికినైన సాక్షాత్కరింప వేమి?
జాగుచేసిననీకటాక్షమ్ము వలన
ప్రాణములు పోవుపిమ్మట ఫలము గలదె?

౨౨

పక్షములు రెండు సర్వప్రపంచమునకు
కృష్ణపక్ష మొకటె నాకు కేవలంబు!
నీవె నిస్సంశయమ్ముగా జీవితేశ్వ
రీ, నిదానంబ వీవై పరీత్యమునకు!





ఎల్లకాల మమావాస్యయే మదీయ
హృదయమున: ఎన్నడేని నీవదనచంద్ర
కాంతి తోచునయేని యాక్షణమునందు
మాత్రము చతుర్దశీరాత్రిమాడ్కి నుండు.

స్వచ్ఛభవదీయముఖశరచ్చంద్రకాంతి
ప్రణయినీ, చెప్పుమింక నెప్పటికి దోచు?
అంధకారమ్ము విరిసి నిరంతరముగ
పూర్ణిమాపూర్ణయామిని పొలుచు టెపుడు?

౨౩

గోచరించుచునుండును గొంతవరకు
మీయజిరభూరుహాగ్రముల్ మేడకొనయు
ఇపుడు నేను వసించెడియీమనోజ్ఞ
బహుతరోన్నత మగుసౌధభాగమునకు.

ద్వితలపర్యంకవర్తినై దేవి, విపుల
జాలమార్గమ్ము వెంట మీసౌధదిశను
గాంచుచుందును నే సముత్కంఠతోడ
సతతవిస్ఫారితాగ్రలోచనుడ నగుచు.

సదనములు కొన్ని ధారుణీజములు కొన్ని
మార్గములు కొన్ని మేడలమధ్యసీమ
గలవు, దూరము స్వల్పమే కాని, మనకు
నుభయులకు భూరిరోధము లున్నరీతి.

నిర్నిమేషము లౌ కనీనికలతోడ,
వెర్రినై పోయి సౌధము వృక్షశిఖలు
సుందరపథమ్ము నిరతంబు చూచుచుందు
వింతసంతోష మావిర్భవించుచుండ.





౨౪

ప్రియతమా, భవదాననబింబదర్శ
నాభిలాషను మీయింటి కరుగుదెంచి
కనుగొనక నిన్ను మందభాగ్యమ్ము వలన
మరలి ప్రాపించినాను మన్మందిరంబు.

మన్మనోహారిణీముఖమంజురుచికి
నోచుకొన్నవి కావు నాలోచనమ్ము
లనెడిసంతాపమున నుబ్బునశ్రుబిందు
జాల మణచితి నెటులో కష్టమ్ముతోడ.

సౌధపార్శ్వమునందలిచలువరాతి
తిన్నెపై వాల్చితిని ప్రియా, దేహ మపుడు.
పండువెన్నెల యొడలిపై బర్వుచుండ
గొంతతడవున కొదవె నొక్కింతశాంతి.

ప్రియశశిముఖా, తావకీనాస్యబింబచింత
నమ్మునం దుంటి శర్వరీనాథకిరణ
ఘాతశీతవితర్దికాతలమునందు:
అవిదితంబుగ నిదుర న న్నావహించె.

## ౨౫

చంద్రికలు గాయుశర్వరీసమయమందు
సమధికోత్తుంగనిర్జనసౌధవిపుల
జాలమార్గాంతికంబున శయ్యమీద
బవ్వళించితి స్వాపసంభావనమున.

కౌముదీస్పర్శచే గవాక్షమ్ము క్రింద
విరియబూచిన "చేరాణి" పరిమళంబు
సారెసారెకు పవనసంచాలనమున
నిఖిలదిక్కుల నిబిడమై నిండజొచ్చె.





సొబగు "చేరాణి" వాసనాస్ఫూర్తివలన
స్ఫురణకుం దాకె నారాణిసోయగంబు!
ప్రేయసీ, మానసము విజృంభించుకతన
నీతలంపులతో రేయి నిదుర లేదు!

ఈవిధంబుగ గడచిన వెన్నెనిశలు!
కలువకనుదోయి నిరతజాగరముచేత
ఫుల్లకోకనదచ్ఛవుల్ పూనె నకట!
నీకు దయ లేదు నామీద నేటికైన!

## ౨౬

అభిముఖంబుగ నుండు మీహర్మ్యమునకు
మానివాసంపుప్రగ్రీవమండలంబు.
పూలమొక్కలు పైనుండి ప్రేలుచుండు
నేత్రపర్వంబుగాగ మృత్పాత్రలందు.

నిన్ను దలచుచు బిళ్ళగన్నేరుపూల
తోట్లలో బోయుచుందును తోయములను
ఉదయసాయంతనమ్ముల సదయమతిని
నియతితో హృదయేశ్వరీ, నిత్య మేను.

ప్రసవపుంజమ్ము నొసగును బ్రతిదినమ్ము
పూలమొక్క లహర్ముఖవేళ నాకు.
వింతరంగుల నీమనోవిరులతోడ
గూర్మి నీనామవర్ణముల్ గూర్చుచుందు!

౧౭

లక్ష్మి, నీనామ మెంతయు లలిత మహహా!
ఎన్నిసారులు నేను జపించినానొ!
ఎన్నిపర్యాయములు లిఖియించినానొ!
తనివి తీరగలేదు సుంతయును నాకు!





ఇతరులు మదంతికమున భాషించువట్టు
లందు వినవచ్చుచో లక్ష్మి యనెడిపల్కు
సంభ్రమంబున నామేను ఝల్లురనును,
భూరితరముగ నొడలెల్ల పులకరించు!

పఠనకాలమునన్ గ్రంథభాగమందు
రచనలో లక్ష్మి యనునక్షరద్వయంబు
కానవచ్చినయంత నాకన్నుదోయి
హర్షవశమున నగును బాష్పాకులంబు!

ఎన్నిలక్షలసారు లే నింతకుమును
పల్కితిని, వింటి లక్ష్మి యన్ పలుకు లక్ష్మి!
ప్రకృతమధురిమ పొడమ దీపదమునందు
నిన్ను బ్రియతమ, చూడకమున్ను నాకు!

౨౮

సంచలనశీల మైననాస్వాంత మెట్లు
నిల్చుకొన్నావు నీపయి నిశ్చలముగ?
ఎట్లు హృదయేశ్వరీ, నీకహీనగరిమ
కలిగె నింతమహావశీకరణశక్తి?

అన్యవశవర్తి గాక యిచ్ఛానుసార
గతిని జరియించునీమతంగజము నవుర!
కట్టినావు భవద్గుణగణముతోడ
ఇట్టియాధోరణత నీకు నెట్లు కలిగె?

విస్మయోద్దీపకము భవద్విజయమహిమ!
దేవి, నా కెంతమాత్రము తెలియదాయె
ఇంతసులువుగ నీమతిమంతు డధిక
గర్వి యెట్టులు నీపదాక్రాంతు డయ్యె?





ఎంతటిప్రభావమే లేని దీవిధాన
భవ్యదివ్యమహాస్వరూపమ్ము దాల్చి
దేవి, ఆత్మాభిమాని నతిస్వతంత్రు
జేసికొన్నావు దాసు విచిత్ర మొదవ!

౨౯

అనిశము మదీయహృదయాంతరాళమందు
ప్రజ్వరిల్లెడి విరహతాపమ్మునకును
తోడయి దహించుచున్నది దుస్సహముగ
నతితరనిదాఘవహ్ని నాయంగకముల.

తాళజాలక ప్రియతమా, తాపమునకు
సాంద్రముగ మేన చందనచర్చ సేయ
ఖండఖండములై రాలె గాని యకట!
ఇంచుకేని దాహము శమియించలేదు.

సలిలసంసేచనమ్ముచే సరసమైన
ఆయతోశీరవిరచితవ్యజనమునను
విసరుకొంటిని ప్రేయసీ, విసువులేక.
తాప మించుకయైనను తరుగలేదు.

తాళనేరక విరహసంతాపమునకు
రమ్యవివిధప్రసూనముల్ రాశిచేసి
శయ్యపై బవ్వళించితి జాలసేపు:
విఫల మయ్యెను, తాపమే వృద్ధినొందె.

తాపము భరింపలేక యుద్యానమునకు
జని నిర్మలచంద్రికాస్నపితతనుడ
నై, శిలాఫలకమ్ముపై నధివసించి
యుండ నొక్కుమ్మడిని మంట లుప్పతిల్లె!

తావకసుధామనోజ్ఞశీతలశరీర
నిబిడసంశ్లేష మొదవక నిలువజాల
నయ్యయో! ఇంక నీవిరహాగ్ని కోర్చ!
కరుణ హృదయేశ్వరీ, స్వయంగ్రాహ మిమ్ము!





౩౦

ఏలనో కాని నలువురి యెదుటి కేను
చనగ లజ్జింతు పౌరుషశాలి నయ్యు.
చిత్ర మగుచున్న దిపుడు, నిశ్శేషముగను
లజ్జ బోగొట్టితివిగదే లక్ష్మి, నాకు!

వెరచుచుందు రహస్యముల్ విప్పిచెప్ప
నాప్తమిత్రుల, కిప్పుడు తదంతికమున
నిన్ననేకవిధాల వర్ణించుచుంటి!
హ్రీభరంబెల్ల నియ్యెడ నెచటి కేగె!

చెప్పి నీమీద కవిత నిస్సీమరక్తి
బాడి ప్రకటించుచుంటిని పద్యవితతి
ఇతరు లేమనుకొన్న లెక్కింపకుండ:
సిగ్గనెడియూహ ప్రియతమా, శిథిలమయ్యె!

## ౩౧

నాహృదయవనమందు ననారతమ్ము
దారుణంబుగ జెలరేగుదావవహ్ని
శాంతి గనదాయె వైరాగ్యసలిలధార
నెంత వర్షింప: ఇంక నే నేమి చేతు!

మరచిపోవుదు నన్నను మరపురాదు;
అయ్యయో! జీవితేశ్వరీ, అనవరతము
నీమహామోహినీమూర్తి నేత్రయుగళి
యెదుట నర్తించుచుండు: నే నేమి చేతు!

అనిశభవదీయభావనాయాసభార
వివశమయ్యెను లక్ష్మి, ఈవిరహిబుద్ధి.
దుర్లభజనానురాగదోదూయమాన
హృదయమున కేమిగతి! ఇంక నేమి చేతు?





క్రీడ నెట్టులైన నొకసారి విడిచి ముగ్ధ,
తెలిసి నీప్రేమ కావు మీదీనజనుని!
ప్రాణములు పోవుచున్నవి! పలుకవేమి
యిప్పటికినైన? అకట, నే నేమి చేతు!

## ౩౨

ఈతనువుపై విరక్తి జన్మించె నాకు!
శ్లక్ష్ణశయ్యోపరిస్థితి సంత్యజించి
పవ్వళించితి ప్రియతమా, బహుదినములు
కఠినపాషాణఫలకభాగంబుమీద.

లోచనరసాయనమ్ములు లోకమోహి
నీమనోహరచంద్రికానిశలయందు;
ప్రమదలుంటాకకాలరూపమ్ములైన
అంధకారభయంకరయామినులను;

శ్రమము హరియించి హృదయప్రశాంతిఁగూర్చు
చల్లనిసమీరణము వీచుసమయములను;
ప్రబలరవమున శర్కరాపటలితోడ
చండిమోజ్జృంభితప్రభంజనములందు;

వేళ లన్నిట నే సమవృత్తితోడ
బవ్వళించితి పాషాణఫలకముపయి !
కాల మేగతి గడచెనో గాని యిపుడు
స్వప్నమువిధాన దోచు సంస్మరణమునను.

బుద్ధియందుండి లోపించిపోయె నాకు
పూర్ణముగ హృదయేశ్వరీ, భోగవాంఛ.
కష్టము సుఖమ్ము ననువిభాగమ్ము లేక
నిర్గుణమ్ముగ నద్వైతనియతి నుంటి.





33

ప్రణయశాలిని, నీపై విరాళిచేత
నేది చేయుటకును నాకు నిచ్ఛ లేదు.
సర్వమును దోచుచున్నది స్వప్నమట్లు
నెలలు గడచుచునున్నవి నిష్క్రియముగ.

మున్ను నయనోత్సవంబుగా ముద మొసంగు
వివిధభాషామహాగ్రంథవితతి యిపుడు
ధూళిధూసరితం బయి దొరలుచుండు
దీనముగ, నాదరించెడి దిక్కు లేక.

వాసరంబులకొలది నుల్లాసగరిమ
బూర్వము మదంతికమ్మున బ్రొద్దుపుచ్చి
మిగుల నన్ను బ్రేమించెడిమిత్రు లిపుడు
కాంచి ముఖభంగి శీఘ్రమ కదలుచుండ్రు.

రమ్యరూపముతో మనోరంజనమ్ము
సలిపెడివిలాసవస్తువుల్ చక్షువులను
నేడు వేధించుచున్నవి నిశితశూల
ఫలకసంకాశభయదరూపములు దాల్చి.

ఏది కనుగొన్న నా కిపు డేడ్పు వచ్చు!
నేత్రయుగ్మము మూసి యీనిర్జనాల
యమ్మున విలోలహృదయభారమ్ముతోడ
బవ్వళింతును పర్యంకభాగముపయి.

అఖిలవస్తువులం దసహ్యమ్ము పుట్టె!
జగము నాబుద్ధి కిపుడు నిస్సార మయ్యె!
వేమరు జనించుచుండును విసువు నాకు
నాపయింగూడ హృదయసంతాపమునను!





౩౮

తలచుచున్నాను నాప్రియతమ వటంచు
ఎంచుచున్నాను నిన్ హృదయేశ్వరిగను
వలచుచున్నాను జీవితేశ్వరిగ నిన్ను
భావనము చేయుచుంటి నిన్ దేవిరీతి.

నీవు ప్రాణాధికవు నాకు నిశ్చయముగ
వాంఛనీయసుఖాధిదైవతమ వీవు
సాటిగానని నాసరస్వతివి నీవు
వాస్తవమ్ముగ భాగ్యదేవతవు నాకు!

నిన్ను ప్రేమించుచున్నాను నిస్తులముగ
నీయెడ జెలంగు నాప్రేమ నిర్మలంబు
నిండు హృదయంబుతో నన్ను నీకు మున్నె
అర్పణము చేసికొంటి సహర్షముగను.

జీవితంపు సర్వస్వమా, శీఘ్రగతిని
నన్ను జేపట్టగదవె అనన్యశరణు!
గాఢరక్తి నర్ధాంగివి కావయేని
ప్రాణముల నింక నే భరింపంగజాల!

## ౩౫

నీహృదయ మెట్టిదో లక్ష్మి, నిశ్చితముగ
నింతవరకును దెలియరా దేమి చేతు!
విశద మొనరింపవైతివి వీని కెపుడు
అతితరంబుగ గంభీరురాల వగుట.

అమలినం బగునా ప్రణయాబ్ధియట్టు
లతిగభీరమె తావకీనానురాగ?
మస్మదీయానురాగహేమాద్రివోలె
నొప్పునే నీకు ప్రేమ మహోన్నతముగ?





అకట! ధీరత్వము న్విడనాడి మిగుల
వెర్రినైపోయి నిన్ బలవించుచుంటి!
నీవు హృదయాపహారిణీ, నిశ్చల వయి
విడువకున్నావు నైజగాంభీర్యముద్ర!

ఎంతకాలము నే నిరీక్షించుచున్న
బంపవైతివి ప్రియతమా, ప్రణయవార్త.
నీకు నావయి లేదేమొ నిబిడరక్తి!
అకట, సంశయ మిపుడు న న్నావరించె!

నీవు నన్ను వరింపగా నేరవేని
తథ్యముగ నిల్వ వసువు లీతనువునందు!
ప్రియతమా, నీవు నాకు లభింపనపుడు
ప్రాణములు నిల్చునేనియు ఫలము గలదె?

౩౬

నా హృదయపుండరీకము నవసిపోయె
అపగతాశాహిమక్లిష్ట మగుచు నేడు !
ముకుళితం బై నవిడప నా మోద మకట,
జీవితేశ్వరి, యేగతి జెలగనేర్చు?

ఈదినంబున నా కది యేమొ గాని
తోచుచున్నది మాటికి దుర్భరముగ
ప్రియతమా, నీవు నాకు లభించుమాట
దుర్లభపురోమరీచికాతుల్య మనుచు !

నీకటాక్షంబు నాపయి నిలువకున్న
దుఃఖభర మేవిధమ్మున తొలగు లక్ష్మి?
నీకు నామీద కరుణ జనింపకున్న
శరణ మగు నాకు కేవలమరణ మింక!.





౩౭

తతమ్మృదులహంసతూలికాతల్పముపయి
విశ్రమించుతలంపున వెన్ను వాల్ప
తోచె హృదయేశ్వరీ, మహాదుస్సహముగ
వర్తమానాతిదుర్బలావస్థ నాకు.

విరహసంతాపము ఘనీభవించి యుండి
అణచుకొన్నను నిలువక యప్పుడు పొంగ
జాలుగా ప్రవహించుబాష్పములవలన
తడిసె హృదయేశ్వరీ, ఉపధాన మెల్ల.

ఎవ్వ రున్నారు న న్నూరడించువారు
ఆవిభావరి నానిర్జనాలయమున !
పౌరుషోదంచితుడ నయ్యు బాలుపోల్కి
రోదనము చేసినాను హృద్భేదకముగ!

మాటిమాటికి బొడమెను మరణవాంఛ!
ఉరికి కృష్ణానదీగభీరోదకముల
తనువు త్యజియించి నీపదధ్యానమునను
అపనయింపగ నెంచితి నాధిబాధ!

ద్వితీయాశ్వాసము

# హృదయశాంతి

## ౩౮

తావకోజ్జీవకమనోజ్ఞదర్శనోత్స
వోత్సుకమదీయలోచనయుగళి దేవి,
భాగ్యముం గాంచ బ్రతికూలభాగధేయ
దుర్విపాకము నేటితో దొలగిపోవ !

మీసమున్న తాట్టాలికమీద నిలిచి
నీవిలోకనసౌభాగ్యనిరతితోడ
నిమ్నభాగాంగణమ్మున నిర్నిమేష
లోచనయుగమ్ము సారించి వేచియుంటి.

అరుగుదెంచితి వప్పుడు నీ నజిరమునకు
కంధరము వాల్చి కేకినీగమనమునను.
నీవు తోచినయాదిమనిమిషమందు
సమ్మదంబున గుండియ ఝల్లురనియె !

కపిశవర్ణమనోజ్ఞాంశుకమ్ము దాల్చి
అంగణమువెంట దేవి, నీ వరుగునపుడు
శాద్వలస్థలి నల్లన సంచరించు
సాధుమృగకాంత నా స్మృతిసరణి దోచె.

సంస్కరింపక కేశపాశమ్ము నీవు
జారుముడి వేసికొంటి వశ్రద్ధతోడ
శాణకోణాగ్రదృఢనికషమ్ము గనని
యింద్రనీలమణిద్యుతి నింపు నింప.

పుణ్యము సమాచరించుట భూలతాంగి
తావకవిలోకనప్రభాధన్య యయ్యె.
గగనమండల మట్టాలకంబు నేను
నలుపమైతిమి పుణ్యలేశమ్ముగూడ !

క్రొమ్ముడిం గాంచి దివ్యచేలమ్ము గాంచి
శబలితశ్రోణిరమ్యదేశమ్ము గాంచి
స్థలకుశేశయరుచిరపాదములు గాంచి
దేహభంగిమ గాంచి నే తృప్తి గంటి !





## ౩౮

బహుళనిర్వేదభరపరంపర మదీయ
చిత్తకుహరమ్ము నావరించినవిధాన
గగనరంగస్థలమ్ము నాకస్మికముగ
బ్రబలగంభీరజలధరపటల మలమె.

సూచికాభేద్యమై తమస్స్తోమ మపుడు
క్రమ్ముకొనియెను దిగ్దిగంతమ్ములందు.
మార్గమును వీడిపోవక మందగతిని
పదము లిడుచుంటి నభ్యాసబలముచేత.

అల్లనల్లన నేను మీహర్మ్యసవిధ
భాగముం జేరగా బ్రభాపటలి తోచె
ముక్తనిమ్నవాతాయనముఖమునందు
యామినీకామినీమందహాసమట్లు.

దేవి, తావకమధుర దేదీప్యమాన
శాంతరమ్యవిలోకనక్షణమునందె
విరిసిపోయెను హృదయనిర్వేదభరము
తరణికిరణప్రభాస్పృష్టతమము భాతి.

తనివి తీరగలేదు నీదర్శనమున,
పల్కరించునదృష్టము పట్టలేదు.
నీసహోదరి యచటనే నిలిచి యుంట
సాగిపోతిని దేవి, నిశ్శబ్దగతిని.

గగనతల మావరించినకాలమేఘ
పటలము తటాలునం బటాపంచ లయ్యె,
మినుకుమినుకని చుక్కలు మెరయజొచ్చె,
దిక్కులన్నియు నొక్కట తెలివి నొందె!





౪౦

పరిగణింపక మధ్యాహ్నభానుకాంతి
నాతపత్రంబు నొకదాని నడ్డుపట్టి
త్వన్మనోహరవదనసందర్శనేచ్ఛ
బయలువెడలితి మీయింటిపథమువెంట.

అస్మదీయవిశేషభాగ్యమ్మువలన
వివృతమై యుండె ద్వార మావేళయందు.
మందగమనములో భవన్మందిరాభి
ముఖుడనైతి సముత్కంఠ మునుకొనంగ.

చల్లనై యొప్పెడి ప్రకోష్ఠశాలయందు
ప్రియతమా, దారునిర్మితపీఠముపయి
మౌనముగ గూరుచుంటివి, మాటలాడు
చుండ నచటనె స్వజన మన్యోన్య మేదొ.

స్ఫీతగండస్థలప్రతిబింబితాచ్ఛ
దవ్యతాటంకయుగళసందీప్తవదన
మండలంబు వెలింగెను మదనదేవు
రమ్యజైత్రచతుశ్చక్రరథముభాతి.

సహజనిబిడానురాగార్ద్రశాంతరుచిర
నేత్రయుగ్మము నామీద నిలిపినావు!
విపులహర్షమునన్ మేను విస్తరించి
కౌముదినిబోలె నెండలో గదలిపోతి!

౪౧

ప్రణయినీ, జ్యేష్ఠమాసప్రభాతరమ్య
సమయమున నేను మీప్రకోష్ఠమ్ము జేరి
గురుజనసమాదరమ్మున గూరుచుంటి
వీథి భవదీయదర్శనాపేక్షతోడ..





అంత మేము భాషించెడియవసరమున
మామకీనస్వరాకృష్యమాణ వగుచు
వల్లుగమనమ్ముతో జేరవచ్చినావు
జీవితేశ్వరి, నన్ను దర్శించుకోరి.

సన్నిహిత మాకవాటపార్శ్వమున నీవు
నిలిచి నాపయి జూపులు నిలిపియుండు
నపుడు నాహృదయస్పంద మధికమయ్యె
నేత్రయుగ్మము సమ్మదోన్నిద్ర మయ్యె.

అంతటిసమీపమునకు నీ వరుగుదెంచి
ప్రియతమా, నిల్చుచో మహాప్రేమ మొలక
దృష్టిని, మదీయహృదయ ముద్రిక్త మయ్యె
కాంక్ష వొడమె తటాలున గాగిలింప!

శీతపవనము నీముఖసీమ సోకి
అలకలు స్పృశించి యవల చేలాంచలంబు
మృదుగతి గదల్చి పిదప నామేని నంట
పరవశుడనైతి సమ్మదప్రాభవమున!

నీమనోహరదివ్యసాన్నిధ్యవశత
స్వాంతమున నాకు సమధికోత్సాహ మొదవె:
సరసముగ జర్చచేసితి చాలసేపు
వివిధగంభీరవిషయముల్ వేడ్కతోడ.

అవల మెల్లన జాలమార్గాంతికమ్ము
జేరి హృదయేశ్వరీ, సమాసీన వగుచు
నిర్భరప్రేమ నుత్ఫుల్లనేత్రములను
గూఢముగ మన్ముఖప్రభల్ గ్రోలినావు!

నీకు నామీది నవనవోన్మేషరక్తి
జెప్పకయె చెప్పుచుండె నోస్నిగ్ధహృదయ!
ఆననమ్మున విద్యోతమానకాంతి
తరలనయనోచ్ఛలత్సముత్కంఠదృష్టి.

హాస్తగతములె యైన నా కష్టసిద్ధు
లపుడు నీకడ జేరి వాతాయనమున
గాటముగ కంఠసీమను గౌగిలించి
అమలశోణాధరమ్ము ముద్దాడియుందు!





గురుజనాంతికమందు గైకొని యనుజ్ఞ
వెడలిపోవుచు నే పరావృత్తి నొంది
నప్పు డుపలబ్ధ మైనప్రేమార్ద్రదృష్టి
మన్మనోహారిణీ, యెట్లు మరవు వచ్చు!

౪౨

అవుర సాకంబె నెంతటియధికవిశద
పుణ్య మొనరించె మీయింటిపొగడతరువు!
వివిధవిధముల నిన్ను సేవించుచుండు
భాగ్యమైనఫలమ్ముల నొందుచుండు.

ఆయతగవాక్షపార్శ్వవేత్రాసనమ్ము
నధివసించి పికాంగనామధురభణితి
కావ్యముల్ నీవు పఠియించుకాలమందు
చల్లదన మిచ్చు వకుళవృక్షంబు నీకు.

6

క్లాంతి గని నీవు మధ్యాహ్నకాలమందు
మృదులపర్యంకతలమున మేను చేర్ప
నలుపు శీతలమారుతచాలనంబు
తాళవృంతాయమానమై తరువు నీకు.

చారువిమలసాయంతనసమయమందు
మధురవిలసనమున నీవు మండనమ్ము
చేసికొనుచుండు వేళ విచిత్రపత్ర
విభ్రమము గొల్పుచుండు పృథ్వీరుహంబు

జాలమార్గమునందు నిషణ్ణవైన
నీకు రజనిని వకుళానీజ మధిక
సౌరభవ్యాప్తి గొల్పు విహారలీల
మధురభావోపవనరమ్యమార్గములను.

నీవు తల్పశయానవై నిదుర వోవ
గన్నుగన మూయ వకుళవృక్షంబు నీకు
మందపవనచలత్పర్ణమర్మరంపు
మృదులగానముతో స్వాప మొదవజేయు.





నీవు కరుణాతరంగితనేత్రయుగళి
వేడ్క సారించు వేళల వృక్షరాజు
సమ్మదోదితసంచలనమ్ము గ్రమ్ము
కంపమానపత్రావళీకైతవమున!

కుసుమములు సంగ్రహించెడు కోర్కె నీదు
మృదులహస్తసంస్పర్శచే ముదితమైన
వేపథువు మాటుకొనుచుండు వృక్షరాజు
భూరిసంభ్రమపతయాళుపుష్పమిషను!

౪౩

అస్మదీయప్రియామృదుహస్తలిఖిత
దివ్యసాగరవర్ణమౌక్తికములార ?
అవగతం బయ్యె నేత్రజాడ్యంబు మిమ్ము
గాంచ గల్గుటచే జిరకాలమునకు!

భవ్యగీర్వాణవాణిరూపప్రతిష్ఠ
బొందె నత్యంతమాన్యత పూర్వమందె,
పరిణయినీకరలేఖనప్రాభవమున
మాన్యతరము నాగరవర్ణమాల నేడు!

తోచుచున్నవి నూతనద్యుతి మదీయ
నామధేయాక్షరమ్ము లీనాడు నాకు,
రమ్యమూర్తులతో ద్వివారము తదీయ
హస్తపల్లవవిలిఖితం బగుటవలన.

ఆమెరూపము గాంచుభాగ్యమ్ము లేక
నిజవికాసము తరుగు నానేత్రములకు
నూతనోల్లాస మిప్పు డనూనభంగి
సంఘటించితి రహహా అక్షరములార!

జీవితేశ్వరి, హృదయవిజృంభమాణ
విమలరాగము నీలీల వెల్లడించి
సంచలించెడిమామకాశాప్రదీప
శిఖను బోషించితివి నేడు స్నేహవృష్టి!





౪౪

పుణ్య మొనరించినావు మత్పుస్తకంబ!
ఎంతసుకృతమ్ము చేయని దెటు లభించె
నాకు దుర్లభ మయ్యెను: నీకు నామె
పాణిపల్లవమంజులస్పర్శనంబు!

ఎంతసుకృతమ్ము చేయని దెటు లభించె
కమ్రతత్కరనీరజగ్రథితమైన
లలితనాగరముక్తాఫలస్రజంబు!
భూరిసుకృతివి నీవు మత్పుస్తకంబ!

ఎంతసుకృతమ్ము చేయని దెట్లు నీకు
పఠనకాలమునందు సంప్రాప్త మయ్యె
ఆశ్రవోయుగవిశ్రాంతహారిలోల
నయనవిగళత్సితాసితనలినపంక్తి!

అనిలవశమున తన్మధురాధరంబు
గండపాళి మనోజ్ఞవక్షఃస్థలంబు
స్పర్శనము చేసియుండును చాలసార్లు!
నీవు నాకన్న సుకృతివి నిశ్చయముగ!

మన్మనోరాజ్యలక్ష్మి, నీమంజులాంగ
భవ్యసంస్పర్శనమున సంభావ్యమైన
పుస్తకము దాకుచో మేను పులకరించె!
ఎట్టు లుండునో నిన్ను స్పృశించునపుడు!

౪౫

శాంతగతి నేను మీమొగసాల జేర,
అధివసించి మనోజ్ఞపటాసనమ్ము
చదువుచుంటివి "శ్రీరామచరితమాన
సమ్ము" ప్రియతమ, కాకలీస్వరముతోడ.





తెలియకుండగ నీకు నే దేవి, యపుడు
చాటున న్నిల్చి నీవికస్వరముఖంబు
కనులపండువుగా గాంచి కదలిపోతి
కర్ణముల మ్రోగుచుండ నీకలరవంబు !

అధికసుకృతము "వ్రజవాణి" యాచరించె:
అట్లు కాదేని దానికి నబ్బె నెట్లు
నామనోహారిణీరసనాసుధార్ద్ర
దివ్యపరిపూర్ణమధురిమోద్దీపనంబు !

౪౬

తాపవారణచణభవద్వదనకౌము
దీప్రసారాభిలాషమై దేవి, నేను
అలసగమనుండ నగుచు సౌధాంగణమ్ము
జొచ్చినాడను సమ్మదస్ఫూర్తితోడ.

ఎదురు పడనైరి నాకపు డెవరుగూడ. -
కామినీజనమంజులకంఠజనిత
దివ్యసంగీతరవ మరుదెంచి యంత
విస్మయము గొల్పి వీనులవిందు చేసె.

జీవితేశ్వరి, గానముచేయుచుందు
వనెడియాశ తటాలున నంకురింప
మోదమున నిల్చి గది కభిముఖుడ నగుచు
గాంచితిని నిన్ను కన్నులకరవు దీర !

లలితకర్ణాటపట్టుచేలమ్ము దాల్చి
అపుడు ప్రియతమ, అర్ధశయాన వగుచు
వెలయుచుంటివి పర్యంకతలముమీద
రమ్యపీఠికపై మహారాజ్ఞివోలె.

లేచితివి నన్ను గాంచి సలీలముగను
పల్కరింపగ నిన్ను నే ప్రశ్నమిడను
కీరగళమున బదులు పల్కితివి దేవి,
లజ్జ నర్తింప నీకపోలములమీద.





నేడు సుదినమ్ము ప్రియతమా, నీమనోజ్ఞ
కంఠరవ మాలకించుభాగ్యమ్ము గలిగె
ప్రథమవారము నీతోడ భాషణమ్ము
నలుపజాలునదృష్టము సంఘటిల్లె!

సారెసారెకు మ్రోయు నాశ్రవణయుగళి
గళదమృతతుల్య మాభవత్కంఠరవము !
మృదులగానతరంగితహృదయసీమ
పొలుచుచున్నది గంధర్వభూమివోలె !

౪౭

దేవి, నే నొకనాడు జ్యోతిష్కు జేరి
జన్మపత్రిక యతనిహస్తమున నుంచి,
"శాస్త్రదృష్టిని స్వామి, యీజాతకునకు
జీవితేశ్వరి యెట్టిదో చెప్పు" డంటి.

సహృదయాగ్రణి జ్యోతిషశాస్త్రవేత్త
ఆదరము కల్గువాడు నాయందు మిగుల.
జన్మపత్రికావిలిఖితచక్రములను
శ్రద్ధతోడ బరీక్షించ జాలసేపు.

కంప మొందగ హృదయ ముత్కంఠ నాత
డేమి పల్కునో యని నిరీక్షించుచుంటి.
ఆననంబున దరహాస మంకురింప
నాదరముతోడ దైవజ్ఞు డనియె నిట్లు:

"ఆర్య,మీప్రియురాలు మహాకులీన,
పరమకోమలహృదయ, లావణ్యమూర్తి,
అధికగుణవంతురాలు, విద్యాభినిరత,
ఒప్పు ననుకూలదాంపత్య ముభయులకును.

"తథ్యము వచింతు నేమియు దాపకుండ-
మీరు భాగ్యవిధేయులై మెలగుచుంద్రు!"
అనగ మోమున చిరునగ వంకురింప
చేసినాను నమస్కృతి భూసురునకు.





౪౮

ప్రియతమా, నేడు మిక్కిలిప్రేమతోడ
పుష్పమాలిక బందరుపురములోని
స్నిగ్ధు లుంచిరి నాకంఠసీమయందు
వచ్చుటంజేసి మజ్జన్మవాసరంబు.

కంబుమంజుల మాభవత్కంఠమందు
ప్రియతమా, పుష్పదామ మర్పింపనిమ్ము!
గాఢనీలమనోహరకైశికమున
ప్రసవములు కూర్పనిమ్ము నీప్రణయజనుని!

పరమకల్యాణరమ్యరూపమ్ము దాల్చి
జీవితేశ్వరి, నీవు హృత్సీమ వెలగ
వేడ్కతో మిత్రులంగూడి వివిధగతుల
వాసరము బుచ్చితిని మహోల్లాసమునను.

ఉత్సవము చేయుదును ప్రియా, యుష్మదీయ
జన్మవాసరమున మహోత్సాహగరిమ!
ఎపుడు ఘటియింపజేసెదో యాసుఖంబు
లక్ష్మి, గాఢానురాగార్ద్ర లలితమతికి!

౮౯

ప్రబలభవితవ్యతాప్రభావమ్మువలన
స్థూలదేహము మిక్కిలి దూరమయ్యు
ననిశము మదీయసూక్ష్మదేహమ్ము దేవి,
అనుసరించుచునుండు ని న్నాదరమున!

క్లాంతి నీ కించుకేనియు గలుగకుండ
చామరము వేయుచుందును సరళగతిని.
గమనమున తొట్రుపాటు సంఘటిల నీక
ని న్ననుసరించి చరియింతు నేనుగూడ.





మజ్జనానంతరము నీవు మండనమ్ము
చేసికొనువేళ నేను సుస్మేరనయన
జలజముల గాంచుచుందు పార్శ్వమున నిల్చి
విమలతావకలావణ్యవిగ్రహంబు.

కావ్యమును జేత బట్టి యేకాంతమందు
శ్రావ్యముగ నీవు మెల్లన జదువుచుండ
సమయమున విందు కర్ణరసాయనముగ
ప్రణయినీ, నిల్చి నీవామభాగమందు.

నీవు హృదయేశ్వరీ, గాఢనిద్ర వోవు
కాలమున నేను పర్యంకికాసమీప
సంస్థితుడనై నివారింతు సకలభూత
వార మంగుళి నీదరి జేరకుండ.

స్వప్నకాలమునందు హర్షమున నీవు
నాథ యనియెడి సంబోధనమ్ము చేయ
గాఢరక్తి ముఖావలోకన మొనర్చి
కాంత, ఆనందగరిమ దీవింతు నిన్ను!

## ౫౦

విమలముగ వెల్గునాజ్యోత్స్న వేళయందు
తలపనితలంపుతోడ సౌధమ్ము జొచ్చి
కూరుచుంటిని పెదలకోర్కి మీద
సంతసమ్మున మా మొగసాలయందు.

ప్రణయినీ, సాగె నపుడు సంభాషణమ్ము
వేడ్క మీరగ మేము కవిత్వచర్చ
చేయుచుంటిమి, కాని నాచిత్తము భవ
దాగమనవాంఛ దహతమాలాడుచుండె.

ఇంతలో హృదయేశ్వరీ, శాంతగతిని
వచ్చితివి నీవు ద్వారపార్శ్వమ్ము జేర.
ఆక్షణంబ నికామనిరంకుశుండు
కామదేవుడు మనకనుల్ కలిపినాడు!





అన్యులకు గానరాకుండునట్లు, నాకు
నభిముఖంబుగ నొప్పువాతాయనమ్ము
దరిసి రెక్కల నోరగా దెరచి, నన్ను
జూచితివి ప్రేయసీ, మహోత్సుకతతోడ!

"నన్ను గొనిపొమ్ము, మన్మనోనాథ!" యన్న
విధమునం దోచె నపుడు నీవీక్షణములు!
మదనదేవుడు నిరుపమమధ్యవర్తి
నిన్ను నర్ధాంగిగా నాకు నిర్ణయించె!

విదితమేని తిరోధానవిద్య నాకు
అచటివారల కెల్లర నవిదితముగ
సత్వరంబుగ నిశ్శబ్దసరణి కాంత,
భుజబలంబున నిన్ను గొంపోయియుందు!

గడియలకొలంది నాగవాక్షమ్ముదరిని
నిల్చి ప్రేమార్ద్రదృష్టిని నీవు దేవి,
నను విలోకించుచో మహానందవృత్తి
నేమి భాషించియుంటినో యెరుక లేదు!

౫౧

తీర్థయాత్రాభిలాషమై దేవి, నేను
బోవనెంచితి నీయాంధ్రభూమి విడిచి;
హాయనమ్ములకొలది దేశాటనమ్ము
సలుపగా నాకు సమధికోత్సాహ ముండె.

నిన్ను గాంచిన యాదిమనిమిషమందె
యెరిగిపోయెను నాయూహ లెచటి వచట!
అఖిలతీర్థముల్ నాకు మీహర్మ్య మయ్యె,
అహహ, లక్ష్మీమహాదేవి వైతి వీవు!

నాటినుండియు దేవి, యీనగరసీమ
తథ్యముగ నాకు వైకుంఠధామ మయ్యె!
భవదుదంచదనుగ్రహప్రసరణమున
నిర్వృతిప్రాప్తి కిచటనే నిలిచియుంటి!





౫౨

ఏశుభముహూర్తమున మనయీక్షణములు
విమలరాగముతో మేళవించె దొలుత
అపుడె నాహృదయేశ్వరి వైతి తదాది
ఏలుచున్నావు లక్ష్మి, యీహృదయసీమ!

హృదయముం జొచ్చి కాంచెద వేని దేవి,
అమలభవదీయమూర్తి ప్రత్యక్ష మగును;
రమ్యతావకనామాక్షరములు దివ్య
రోచిరుట్టంకితమ్ములై గోచరించు!

నిర్భరానందబుద్ధినై నిరుపమాన
తావకీనస్తవమ్ము పద్యముల గూర్చ
ప్రియతమా, వాఙ్మయమున నీపేరు నిలుచు
శాశ్వతమ్ముగ, నాహృదయేశ్వరి వని!

౫౩

అమరు నాయెడ నీకు గాఢానురాగ
మను మహోహర్షజనకవృత్తాంతకలన
వరలుచున్నాడ నుత్ఫుల్లవదనుడ నయి!
శాంతి నెలకొనె మిగుల నాస్వాంతమందు.

నీవు హృదయేశ్వరీ, నన్ను నెమ్మనమున
నిరుపమప్రేమతోడ ధ్యానించుచుందు
వనుపదమ్మని యవగత మగుచునుందు
నాకు నీముఖపద్మవిలోకనమున!

కర్మ పరిపక్వమై శుభక్షణమునందు
దైవకృప నుపలబ్ధమా తావకీన
పాణి యనియెడి నిశ్చలప్రత్యయమ్మె
లక్ష్మి, వీనికి జీవితాలంబనంబు!





నిర్భరప్రేమవివశవై నీ వధైర్య
తిమిరముం ద్రోలి సాహసోద్దీప్తితోడ
పూర్ణవిశ్వాసమున మనఃపూర్వకముగ
లీల మదురస్స్థలమ్ముపై వ్రాలువరకు-

కల్పము లతీతమై పోవుగాక దేవి,
వేచియుందు వికస్వరలోచనముల,
ఏకనియతిని లోక మీక్షించుచున్న
శ్రీమదవలోకితేశ్వర స్వామి పోలె!

## తృతీయోచ్ఛ్వాసము

*

## ౫౮

మేలుకోలు మహాజీవితేశ్వరి !
జాల మేటికి, చూడు మియ్యెడ
జాలమార్గము క్రింద నిల్చితి
పూలచాలులలో !

యోజనమ్ములదూర మేను మ
హాజవమ్మున దాటి చేరితి
నోజ నిట భవదీయవదనాం
భోజ మీక్షింపన్.

చాలకాలము గడచినది ప్రియు
రాల, కన్నులపండువుగ నీ
వాలుగన్నులతరళకాంతులు
వ్రాలి నామీదన్.

మించున ననురాగమ్ముతో నే
తెంచితిని హృదయేశ్వరీ, నే
త్రాంచలమ్ముల ప్రణయజను వీ
క్షించు మనురక్తిన్!

ఇంతకాలము ప్రణయినీ, నీ
యంతికమునకు నేను రామికి
నెంతగా జింతించుచుంటివొ
యంతరంగమునన్!

నిక్కముగ ప్రాణేశ్వరీ, నే
నొక్కనిముసం బైన నీస్మృతి
దక్కియుండగ లేదు సుమి యే
దిక్కునం దిరుగన్!

ఉల్లసద్భవదీయరూపం
బుల్లమున నెలకొల్పి దృఢముగ
నెల్లవేళల దలతు నేను
త్ఫుల్లనేత్రుడనై!





శోషణమ్మును గాంచనీక ని
మేషమేనియు, నీదుభావో
న్మేష మొదవగజేసె హృత్సరి
తోషణము లక్ష్మీ!

ప్రేయసీ, ఉన్ముక్త మగువా
తాయనాధ్వమువెంట నను భవ
దాయతాక్షుల గనుము నా కా
ప్యాయనము కలుగన్!

కాంత, యీదూరప్రయాణ
క్లాంతి వోవగ స్నేహపూర్ణా
త్యంతశీతలవీక్షణంబుల
కాంతు గన్గొనవే!

## ౫౫

అంతరిక్షమునుండి రజనీ
కాంతు డఖిలముఖమ్ముల న్నిజ
కాంతుల స్వేదజల్లు మత్ప్రియ
కాంత, కన్గొనవే!

ఈమనోహరవేళ దేవీ,
కౌముదీధవళీకృతము లౌ
భూమిజంబులనొప్పునుపవన
సీమ గన్గొనవే!

ఇన్నిశాసమయంబునం దీ
వెన్నెలన్ హృదయేశ్వరీ, నే
జెన్నుమీరుచునుంటి నెంతయు
నన్ను గన్గొనవే!





అలకజాలాచ్ఛాదితంబై
తిలకరేఖోదంచితంబై
అలరుమన్ముఖమండలాధిక
విలసనము గనవే!

వ్రేలునాయతమల్లికానుమ
మాలికోజ్జ్వలమద్గళమ్మున
లోలభవదీయేక్షణమ్ముల
వ్రాలనీయగదే!

భూరిచిత్రాంచలసముజ్జ్వల
గౌరకౌశేయావృతశరీ
రోరుకాంతుల ప్రణయినీ, యిటు
తేరిచూడగదే!

లలన యని భ్రమజెంది రస్మ
ల్లలితభంగిమ గాంచి పథమున
పలువు రోహృదయేశ్వరీ, నా
చెలువముం గనవే!

అనవరతభవదీయదృఢభా
వనమునం బరివ ర్తితంబై
తనరు నీముఖమట్లు నాయా
ననము గన్గొనవే!

లలితవేషవిలోకనమ్మున
వలపు గల్గెను నాకు నాపై!
దళితమంజులనీలనయనో
త్పలములం గనవే!

ముదితహృదయముతోడ నీకా
ముదిని మధురారామసంస్థితు
హృదయరాజ్ఞీ, గాఢరాగా
స్పదుని గన్గొనవే!





౫౬

నిన్ను గూరిచి జీవితేశ్వరి,
నేను దుస్సహ మౌతిరస్కృతి
నంది సైచితి: నన్ను బ్రేముడి
నాదరింపగదే!

పల్కుపల్కున దేహ మొక్కట
భగ్గుమనుక్రోధాగ్ని నయ్యెడ
నణచికొంటిని: నన్ను బ్రేముడి
నాదరింపగదే!

తావకీనముఖాంబుజప్రభ
తగుల నా స్మృతిసరణి బొలిచిన
దాత్మదమనము: నన్ను బ్రేముడి
నాదరింపగదే!

అధికదుస్సహాపరిభవానల
మారిపోవగ జేర్చి కౌగిటి
యందు లక్ష్మీ, నన్ను బ్రేముడి
నాదరింపగదే!

తాపహరణమనోజ్ఞశీతల
తావకీనేక్షణమె మోక్షము!
అన్య మేటికి: నన్ను బ్రేముడి
నాదరింపగదే!

౫౨

గణననేయకుమీ ప్రధానము
గా మదాకృతి ప్రాణకాంతా!
ఎంచి నాగాధానురాగము
హృదయ మీయగదే!





ప్రియతమా, భావింపబోకుము
పృథులముగ మద్వాక్చమత్కృతి:
ఎంచి నాగాధానురాగము
హృదయ మీయగదే!

పరిగణింపకు మెంతమాత్రము
ప్రణయినీ, అస్మత్ప్రశస్తిని:
ఎంచి నాగాధానురాగము
హృదయ మీయగదే!

గణనసేయగ వలదు మద్గుణ
గణము మెందుగ జీవితేశ్వరి!
ఎంచి నాగాధానురాగము
హృదయ మీయగదే!

అవ్యయంబును భవ్య మగు ప్రా
ణాధికా, ప్రణయప్రభావము:
ఎంచి నాగాధానురాగము
హృదయ మీయగదే!

౫౭

నిన్ను గొనిపోవంగ నిదె దృఢ
నిశ్చయమ్మున నరుగుదెంచితి
వేగముగ ప్రాణప్రియా, యిక
వెడలి రాగదవే!

గాఢనిద్రాముద్రితం బయి
కదలకున్నది భువన ; మీసుఖ
వేళ నిర్భయవృత్తి లక్ష్మీ,
వెడలి రాగదవే!

భీకితో బనిలేదు నీ కిక
ప్రియతమా, నీరక్షణమ్మున
విడుతు బ్రాణములేని ధీరత
వెడలి రాగదవే!





అంధకారభరమ్ము నించుక
యణచి తారలు మినుకుమినుకని
వెలుగుచున్నవి ప్రాణకాంతా,
వెడలి రాగదవే!

భయము కల్గదు ప్రణయినీ నా
బాహు వవలంబనముగా వన
వీధి నడుగుల నిడెద, వింతట
వెడలి రాగదవే!

సంశయింపకు ప్రియతమా, ని
శ్శబ్దగమనముతోడ బోదము
విరులపడకలమీదుగా, నిక
వెడలి రాగదవే!

భయము లన్నియు బోవు నాభుజ
బంధనమ్మున హృదయలక్ష్మీ!
వీరభావం బతిశయిల్లును
వెడలి రాగదవే!

## ౮౩

ఉద్యమించుచు నీకు సౌఖ్యం
బొనరజేయగ నెపుడు దేవీ,
ఆదరంబున మెలగుచుండెద
నార్ద్రహృదయముతో.

ముఖమనోహరమండలమ్ముపై
ముంగురులు సవరించి దేవీ,
ఆదరంబున మెలగుచుండెద
నార్ద్రహృదయముతో.

తిలకరేఖను దిద్ది తావక
దివ్యాననసీమ దేవీ,
ఆదరంబున మెలగుచుండెద
నార్ద్రహృదయముతో.





విరులు మంజుల కైశికమ్మున
వింతవింతగ దురిమి దేవీ,
ఆదరంబున మెలగుచుండెద
నార్ద్రహృదయముతో.

కంబుకంఠమునందు మరకత
ఖచితహారము లుంచి దేవీ,
ఆదరంబున మెలగుచుండెద
నార్ద్రహృదయముతో.

చంచదురుకాంచీకలాపము
జఘనమున ఘటియించి దేవీ,
ఆదరంబున మెలగుచుండెద
నార్ద్రహృదయముతో.

నీకు పూర్ణాలంకృతి న్నే
నిపుణముగ గావించి దేవీ,
ఆదరంబున మెలగుచుండెద
నార్ద్రహృదయముతో.

భవదమలలావణ్యరోచిః
ప్రసరమున కుప్పొంగి దేవీ,
ఆదరంబున మెలగుచుండెద
నార్ద్రహృదయముతో.

భవ్యభవదీయాకృతిన్ బహు
భంగులను జిత్రించి దేవీ,
ఆదరంబున మెలగుచుండెద
నార్ద్రహృదయముతో.

నీగుణస్తుతిగీతికావళి
నిరుపమమ్ముగ బాడి దేవీ,
ఆదరంబున మెలగుచుండెద
నార్ద్రహృదయముతో.

సాంద్రమద్భుజమధురసంశ్లే
షమున నిను లాలించి దేవీ,
ఆదరంబున మెలగుచుండెద
నార్ద్రహృదయముతో.





బింబఫలముల కాంతి మీరెడు
పెదవులను ముద్దాడి దేవీ,
ఆదరంబున మెలగుచుండెద
నార్ద్రహృదయముతో

౬౦

వివిధసారస్వతనదీనద
విమలజలముల నోలలాడుచు
అనిశ మానందాధిగమమున
నలరెదవు లక్ష్మీ !

చిత్రశిల్పకళావనాంతర
సీమలందు విహారలీలల
అనిశ మానందాధిగమమున
నలరెదవు లక్ష్మీ !

దివ్యగానతరంగముఖరిత
దేవధరణీవిహారణమ్ముల
అనిశ మానందాధిగమమున
నలరెదవు లక్ష్మీ!

స్వర్గఖండమునందు మధుర
స్వప్నసంచారములతో నీ
వనిశ మానందాధిగమమున
నలరెదవు లక్ష్మీ!

సర్గబంధమువిధమునన్ రస
సంభృతంబై తనర జీవన
మనిశ మానందాధిగమమున
నలరెదవు లక్ష్మీ!



# సుఖస్వప్నము

## [ జన్మవాసరోత్సవము ]

భర్త

గాఢమధురము నీస్వయంగ్రాహ మహహా!
ఒనగు హృదయేశ్వరీ, మరియొక్కసారి!
మంజులంబైననీసుధామధురవదన
బింబ మేది ప్రియా, ముద్దు పెట్టుకొందు!

తనివి తీరుటలేదు నేత్రముల కెంతే
నిను విలోకించుచున్నను నేను లక్ష్మి !
సొబగుమీరిన దవుర నీసోయగంబు !
దేవి, కలకలలాడుచున్నావు మిగుల !

పూర్ణిమాకౌముదీపరిపూర్ణధవళ
లలితదివ్యకౌశేయచేలమ్ము దాల్చి
వరలుచున్నావు నేత్రోత్సవముగ నాకు,
విరియబూచిన మల్లెపందిరివిధాన.

మహితలావణ్యమున సుకుమార మగుచు
కాంచనాభ వెలుంగు నీగాత్రలతిక
చూడజూడగ నెంతయు సొబగుమీరు
తప్తమైనకొలంది కుందనమువోలె.

దేవి, కుంకుమతిలక దేదీప్యమాన
రమ్యవిపులభవత్ఫాలరంగ మొప్పు
నవ్యభాస్కరారుణకిరణమ్ము సోక
బొల్పుమీరు నలవిదూరభూమిభాతి.

స్వచ్ఛమృగనాభికాఘనసారచూర్ణ
సురభిళం బయి తాంబూలశోణ మైన
తావకీనాస్య మీయగా దగదె మరల!
ఆరకున్నది ప్రేమవిహ్వలునితృష్ణ!

ఒప్పుచున్నావు జన్మదినోత్సవంపు
వేళ ప్రాణప్రియా, రమ్యవిగ్రహంబు
బూనుచ నస్మన్మనోరథస్ఫూర్తితోడ!
బంధురం బైనదోర్లతాబంధ మిమ్ము!





భార్య

మేరమీరుచు నున్న దివ్యోడ
పారవశ్యము హృదయనాథా!
భూరితావకవాక్సుధారస
ధార చెవి సోకన్.

కూరిమిని హృదయేశ, నే మీ
పేరురంబున వ్రాల బులకాం
కూరములతో నాతనూలత
కోరకిత మయ్యెన్

పొంగిపోవుచు నున్న దోహో
తుంగభంగము గాగ నాహృ
ద్గంగ మీయనురాగవార్నిధి
సంగతిని నాథా!

ఊరలె నానందాశ్రువులు వాక్
స్ఫురణ మణగెను, బాహుయుగళాం
తరమునందు వసింపనిం డిటు
నిరత మాత్మేశా!

## భర్త

త్రిదశవర్షవయస్సున దేవి, యెపుడు
త్రిదశులవిధాన మిగుల వర్ధిల్లు మీవు
నిత్యయౌవనరూపనిర్నిద్రబుద్ధి
విభవమున నూతనోత్సాహవిలసనమున !

నూపురంబులు మ్రోయ మనోహరముగ
కటకములు హృద్యరవమున ఘల్లు రనగ
శింజితం బొనరింప గాంచీకలాప
మరిగి హృదయేశ్వరీ, పీఠ మధివసింపు !

నవ్యసురభిళవివిధసూనములు దెచ్చి
ఆర్ద్రహృదయమ్ముతో మదీయాంగుళులను
గ్రుచ్చినసుదీర్ఘరమణీయకుసుమమాల
లలితకంఠప్రదేశ మలంకరింతు !

అమితకోమల మగునీకరాంబుజాత
మేది యొకసారి యిటు ప్రసారింపు మిపుడు
దేవి, శాణితవజ్రదేదీప్యమాన
మమలకార్తస్వరాంగుళీయకము నుంతు !





హర్షమున మత్కరోల్లిఖితాక్షరంబు
ధవళకౌశేయవస్త్రబద్ధంబు హేమ
రసలతాచిత్రితం బతిరమ్యకావ్య
మిదిగో, సంప్రీతిని పరిగ్రహింపు మిపుడు !

నిరుపమప్రేమవార్ధి జన్మించినట్టి
రమ్యకృతిరత్నము సమాదరమ్ముతోడ
చేసినా సంకితము నీకు: స్వీకరించి
హృదయమున దీని ధరియింపు మింపుమీర !

## భార్య

పరమనిర్వ్యాజానురాగము
పురుషరూపము దాల్చి విశ్వం
భరను వర్తిలుచుంట సరణిని
వరలెదరు నాథా !

సదయమును గంభీరమగు మీ
హృదయమందలి యార్ద్రభావం
బాదవ గలదే ప్రాణవల్లభ,
ముదితలకు నైనన్ !

పల్లవించును బ్రత్యహము నా
యుల్ల మభినవభంగి నీయు
ప్పొల్లలద్భవదీయ భణితులు
వల్లభా, వినుచోన్!

గురువు భర్తయు నైనమీరలు
చరణదాసిని నన్ విభూ, యిటు
గరిమ నుపలక్షించుట మహా
కరుణ సూచించున్!

భర్త

పలుక దగునె యిట్లు ప్రాణేశ్వరీ నీవు!
కరుణ గాదు నాకు, గౌరవంబు!
కనికరంబు దీనజనములయెడనె: నా
మతమునందు భార్య మాన్యురాలు!

పెక్కుమాట లేల ప్రియతమా, భవదీయ
పల్లవాభిరామపాదయుగళ
మస్మదీయమస్తకాభరణం బగు
చుంబనార్హ మగును జుమ్ము నాకు!





భార్య

చాలుజాలును భాషణము లీ
లీల లజ్జావనత జేయగ
బోలునే మీచరణసేవకు
రాలి నాత్మేశా!

కృతుల నింతకుమున్న నా కం
కితము చేసితి రెన్నొ, నను సం
స్తుతిపురస్సరముగను వర్ణిం
చితిరి బహుగతులన్.

హెచ్చుప్రేమను నూత్న కావ్యం
బిచ్చితిరి: మీ కైతలు నిరతము
వచ్చు కావ్యతరంగమాలిక
లచ్చెరువు గొలుపన్!

భర్త

అల్లుచుందు కావ్య మాస్థానకవి నౌట
దేవి, ఉత్సవంపుదినములందు.
ఆర్ద్ర మైనహృదయమందుండి యుప్పొంగు
విమలకవిత: ఇందు వింత లేదు.

నిన్ను మొదటిసారి కన్నులారంగ నే
శుభముహూర్తమందు జూచినానో
ఆక్షణంబునుండి యార్ద్రమై హృదయంబు
నేటివరకు కవిత నివ్వటిల్లు!

నిశ్చయముగ నేను నీప్రేమచేతనే
కవివరుండ నైతి, గాన నాకు
భావ్య మగునుగాదె ప్రాణేశ్వరీ, నీకు
నర్పణంబు నేయు టన్నికృతులు!

భార్య

అరుగో లోనికి బిడ్డ లిర్వురు
నరుగుదెంతురు క్షణములో, నా
చరణములకడనుండి లెండిక
త్వరితముగ నాథా!

* * * *





కుమారుడు

మంచిమంచిపూలు మనతోటలోనివి
వేయికనులతోడ వెదకివెదకి
చిదిమిపోసినాను చెల్లిచేతులలోని
పూలబుట్ట నిండిపోవునట్లు.

గున్నపొగడ జేరి కూర్చుంటి మచ్చోట
సన్నచలువరాతి తిన్నెమీద
మాటలాడుకొనుచు మణికర్ణికయు నేను
ప్రమదమున నుత్సవమ్ముగూర్చి.

వేడ్కతోడ చెల్లి వివిధపుష్పంబులు
చిత్రచిత్రగతుల జేర్చి మిగుల
నందమైనపుష్పహారంబు గ్రుచ్చె నీ
మెడను వేయుకోర్కె కడలుకొనగ.

అమ్మ, యిపుడు నీకు నర్పించుతలపున
పరిమళంబు గలుగువిరులు గూర్చి
ప్రీతితోడ నేను చేతనైనవిధాన
చెండు గట్టినాను స్వీకరింపు!

నాన్న యుంచినట్టినా కెంపుబుమ్మహా
రమ్ముతోడ నొప్పునమ్మ కంఠ
దేశమందు నుంచు దీర్ఘదామమ్మును
చిన్నిచెల్లి, చిగురుచేతు లెత్తి!

భార్య

తండ్రి, వచ్చి అంకతలమున గూర్చుండి
కౌగిలించుకొమ్ము కంఠసీమ!
నన్ను గన్నతల్లి, నాయొడిలోన గూ
ర్చుండి యీయగదవె యొక్కముద్దు!

శ్రమము చెందినావు జయదేవ, యీనాడు
జనని కెంతొ సంతసంబు గూర్చ.
అమితకోమలంబులైన నీహస్తముల్
చాల నెఱ్ఱవారె పూలు గోయ!

చిట్టితల్లి, అమ్మ పుట్టినరోజున
పండు గనుము నీవు దండ గ్రుచ్చ
నప్పుడయ్యొ యెంత నొప్పు లెత్తెనోగదా
చిగురుటాకు లట్టిచిట్టివ్రేళ్ళ!





జీవితేశ, యిపుడు చిన్నిబిడ్డల సమా
లింగనమ్ముచేత చెంగలించె
చిత్తమందు మిగుల శీతలభావంబు
అమృతరసవిలేప మైనయట్లు!

చూచుకొన్నయపుడు లోచనపర్వంబు
గాగ మిమ్ము స్వర్గఖండ మలరు
ధరణితలముమీద! ధన్యురాల నటన్న
రీతి దోచుచుండు చేతమందు!

కుమారి

మిగుల కోమలంపు మేను గావున మమ్ము
గూరుచుండబెట్టుకొనగ లేవు;
అన్న యొక్క డుండు నమ్మ, నీయొడిలోన
నన్ను బోవనిమ్ము నాన్నకడకు.

భార్య

నన్ను గన్నతల్లి, నాకు భారం బటే
చిట్టినీశరీర! మెట్టులైన
మాతృరక్తికన్న మణికర్ణికకు దన
తండ్రిమీద ప్రేమ దశగుణంబు.

అవును: చిన్నితల్లి అనుకరించుచునుండు
జనకురీతి: తండ్రిచాలుబిడ్డ!
అచ్చుగాను మీరె యాకృతిలో భేద
మేమి గోచరింప దిర్వురకును!

కుమారి

ముద్దు లొల్కు మంచిముత్యాలవలె నొప్పు
రమ్య మైనయక్షరములతోడ
వ్రాయుచుందు నాన్న వచియించుచుండ నా
నందమునను మధురనవ్యకృతులు.

చాలమధుర మైనసంస్కృతభాషను
నేర్చికొందు మిగుల నియతితోడ.
శాస్త్రములనుగూడ సాధించి విద్వాంసు
రాల నగుదు పెద్ద యైనవెనుక.

శ్రద్ధతోడ నేను చాలభాషల నభ్య
సింతు నాన్నగారియంతికమున;
కవిత నేర్చి గొప్పకావ్యముల్ నాన్నకు
నమ్మ కన్న కీర్తి నంకితంబు





భర్త

ఓసితల్లి, యెట్టియూహాలే నీ కింత
చిన్నతనమునందె యున్న వవుర!
నిన్ను గన్నలక్ష్మినేర్పు నే మన వచ్చు!
నీకు గల్గె జననినిపుణబుద్ధి!

కుమారి

నిన్ను లక్ష్మి యనుచు నిరతంబు ప్రేమతో
పేరుపెట్టి నాన్న పిలుచుచుండ
నాన్న నొక్కసారి నవ్వుటాలకునైన
పేరుపెట్టి నీవు పిలువ వేమి!

భార్య

ఎట్టిసంశయంబె చిట్టితల్లీ! వారి
పేరుపెట్టి నేను పిలువరాదు.
నాన్నగారిదివ్యనామాక్షరశ్రేణి
విలిఖితంబె హృదయఫలకమందు!

మంచి, దొక్కమాట: మణికర్ణికా, నీవు
సర్వకాలములను జనకుమ్రోల
నోలలాడుచుందు వొక్కొ విద్యలలోన
పెండ్లియూహ విడిచిపెట్టికూడ!

భర్త

కాదుకాదు: బిడ్డ గణియించి విద్యల
యందు పటిమ షోడశాబ్దములకు
వరుని యోగ్యుడైనవానిని వరియించి
పెండ్లియాడి చనును ప్రియునివెంట.

భార్య

అవుర, పిల్ల మందహాసంబు చేసెను!
మగనిమాట అంతమధుర మొక్కొ!
ప్రియుని గాంచి, వదలిపెట్టి పోవుదువుగా
చిట్టితల్లి, నన్ను పుట్టినిల్లు!

భర్త

ఎల్లకాల మతివ యెటు తల్లిదండ్రుల
నవిధమందు నుండజాలు చెప్పుము!
హృదయనాథుకడకు నేగక మానునే?
నీవు లక్ష్మి, వచ్చినావు కావె?

* * *





భార్య

చాలుజాలులెండు చాతుర్య మాత్మేశ!
పుట్టినిల్లు విడిచిపెట్టలేక
బహుదినమ్ములెన్ని బాధలు పడితినో
యెట్లు మీరు విస్మరించినారు!

భర్త

మరవలేదు నేను మానినీ, నీమనో
రంగమందు నాటిసంగరంబు.
ప్రబలమగుటవలన ప్రవిమలప్రేమంబు
శ్లాఘ్యగతిని తుదకు జయము గాంచె!

* * *

కుమారుడు

అరుగనిమ్ము చెల్లి నత్తవారింటికి,
నిన్ను నేను విడువ నెన్నడమ్మ!
శ్రద్ధతోడ నిన్ను సంరక్షణము చేతు,
నాచరింతు పూజ లధికభక్తి.

చిత్రకళల నభ్యసించి చిత్రించెద
తనివిదీర బహువిధాల నేను
అమ్మ, మిగులరమ్య మైననీయాకృతి
సర్వలోకనేత్రపర్వముగను!

సార్థకంబు గాగ జయదేవనామంబు
పాడుచుందు గానపటిమ నమ్మ!
ప్రీతి కల్గ నీకు "గీతగోవిం" దాది
కృతుల వివిధమధురకీర్తనలను.

అమ్మ, నీకు హృద్య మైనహిందూస్థాన
భాషలోనె యెపుడు పలుకుచుందు.
విశ్రమింప నీవు వివిధభాషాగ్రంథ
ములను జదివి నీకు ముదము గూర్తు.

భార్య

నాకు లోప మేమి నాతండ్రి, జయదేవ,
ఉండ నీకు నిట్టియూహ లాత్మ!
ఆదరించుభర్త యనుగుబిడ్డలు నాకు
గలుగ నింక నేమి కావలయును!





చక్కనయ్య, నామసంసారవల్లికి
మొకటిఫలమ, యేది ముద్దుపెట్టు!
నీవు జనన మొంద నిశ్చయంబుగ నోయి
తండ్రి, జీవనంబు ధన్య మయ్యె!

భర్త

సరభసంబ వచ్చి జయదేవ, నాతండ్రి,
కౌగిలించుకొమ్ము గాటముగను
చిన్నినీశరీరశీతలస్పర్శ నా
యంతరంగ మధికశాంతి నొంద!

భగ్న మయ్యె మున్ను బహుమనోరథములు
విముఖవిధివిధానవిలసనమున!
జనకు మీరి భాగ్యశాలి వై తలపెట్టు
కార్యములను జయము గాంచు మోయి!

కుమారుడు

అమ్మ, తోటలోని కాడుకో బోదును
చెల్లితోడ, నింక సెలవు నాకు!

కుమారి

అన్నవెంట నింక నారామమున కేగ
నా కనుజ్ఞ యిందు నాన్నగారు!

* * *

భర్త

కన్నబొమలు కంఠకర్ణముల్ నాపోల్కి
తక్కినట్టిరూపు తల్లిపోల్కి.
లక్ష్మి, కంటి వధికలావణ్యమూర్తిని:
తల్లిచాలునుతుఁడు ధన్యుఁ డగును!

* * *

ఎంతమధుర మహాహా! హృదయేశ్వరీ, నాకు
నీ వొసంగి నట్టినిబిడ బాహు
బంధనంబు! రమ్ము, ప్రమదంబుతోడ న
లంకరింపు మింక నంకతలము!





భార్య

కౌగిలింతలోన గ్రైవేయకంబును
భూరికఠిన హేమభూషణములు
గ్రుచ్చుకొన్న వేమొ కోమలమైనయీ
గాత్రమునకు ప్రాణకాంత, యిపుడు!

భర్త

నీవు మామకీననిబిడసంశ్లేషమ్ము
నందు నిమిడియుండునప్పుడు లక్ష్మి!
కేవలముగ సౌఖ్యదేవతయే విగ్ర
హమ్ము దాల్చి యొప్పునట్టు లుందు!
నీలమణుల బోలు నీనయనంబు లీ
క్షింపనిమ్ము లక్ష్మి, చిరము నన్ను,
విస్మరించి లోకవృత్తంబు కేవల
స్వర్గసుఖము గాంచజాలి యుందు!

మధురగళముతోడ మన్మనోరంజనం
బొనరుపంగ పాడుచుండ నీవు
విహరణంబుసేయు వివశమ్ము గంధర్వ
భూమి మామకీనబుద్ధి లక్ష్మి!

వివిధభాషలందు వెలసిల్లు గ్రంథముల్
విశదఫణితి నీవు వినుచుచుండు
సమయమందు లక్ష్మి, సంఫుల్లమగు మదీ
యాంతరంగసీమ హర్షగరిమ!

గాఢపాకజటిలకావ్యపఠనవేళ
ప్రతిభతోడ కఠినభాగములను
అన్వయింప నీవు హర్షవిహ్వలత ని
న్నెన్నిసార్లు కౌగిలించినానొ!

వ్రాయుచుండ నీవు వాచ్యమానగ్రంథ
భాగములను హస్తపల్లవంబు
నెన్నిసార్లు నేను హృదయేశ్వరీ, ముద్దు
పెట్టుకొంటి మనసు పట్టలేక!

లక్ష్మి, తావకీన లలితాంకపాళిని
కూర్మి శిరము పెట్టుకొని పరుండి
నీముఖాంబుజంబు నిర్నిమేషంబుగా
జూచుచుంట యెంతసుఖము నాకు!





సాంద్రరక్తి నీవు సహధర్మచారిణి
వై మహాసుఖాబ్ధియందు నన్ను
అనిశ మిట్లు లోలలాడింపకున్నచో
నెట్టికగతి నాకు బట్టియుండు!

భార్య

ఎట్టిదింతమాట హృదయేశ! మిమ్ము జే
పట్టుకతన నైతి భాగ్యవతిని!
పూర్వజన్మరచితపుణ్యావశంబున
నను పరిగ్రహించినారు నాథ!

మిమ్ము గాంచినంత మీపదాక్రాంతలా
సజ్జగించి
[illegible], నన్ను స్వీకరించుట తలం
పంగ నాయదృష్టఫలము గాదె!

పురుషు లధికచపలబుద్ధులు నూతన
ప్రియులు గాన వారిప్రేమ దృఢము
కా దటన్నపలుకు కాంత, మీయెడ నన్వ
యింపనేర దెన్నడించుకైన!

### హృదయేశ్వరి

అప్రయత్నసరణి నాత్మేశ, తావక
ముఖవిలోకనోరుసుఖము నాకు
సంఘటిలకమున్న సాంద్రనీహారంబె
యావరించి యుండె నన్నికడల.

మిహిక విరిసిపోయె మీయాననాబ్జ
రోచి యొక్కనాడు తోచినంత;
తెలివి నొందె నూత్నదీధితితో మది
యాశితరంగసీమ యపుడు నాథ!

స్వైర మయ్యె హృదయనీరేజ మహహా! ఆ
నాటనుండి నాకు నవవికా
సహాసహాంబు సమృద్ధి
జీవనమున సౌఖ్యదివ్య మయ్యె!

అణగి యుండనీక యాశ్రామసీమ నీ
చిన్మయమహ మిట్లు జీవితేశ!
అవిరతక్రమమున మార లవతంసమగు నాల్ప.
గలిగె దీని కధిక గౌరవంబు

